


ప్రజలు మిమ్మల్ని మెచ్చితీరేందుకేమరి

# మధురా బట్టలు

మధురా కోట్స్ ఉత్పాదన

మధురా సౌత్ ఇండియా కార్పొరేషన్ (ప్రై.) లిమిటెడ్ 68, మూర్ స్ట్రీట్, మద్రాసు 600 001. శ్రీ లక్ష్మి టెక్స్‌టైల్స్ బెసెంట్ రోడ్, గవర్నర్ పేట, విజయవాడ 520 002.

378 TEL

## లోకం పోకడ










**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938—1972]
శుక్రవారం : 20-6-'80
రవు(దినావ సం. నిజ జ్యేష్ఠ శు. అష్టమి
సంపుటము 73 : సంచిక 43
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 49-40
ఆరు మాసాల చందా రు. 24-70
విడి ప్రతి వెల 90 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :

"మాయదారి కృష్ణుడు'లో రతి









**అధిక దిగుబడి ప్రతి పైరునుండి ప్రతి సారి పొందాలంటే మీ భూమిలో సారం అధికంగా ఉన్నప్పుడు మాత్రమే సాధ్యమవుతుంది.**

మీ భూసారం అధిక స్థాయిలో ఉండేందుకు ఈ క్రింది పద్ధతులు అవలంభించండి.

1. సిఫార్సు ప్రకారం నత్రజని, భాస్వరం, పొటాసియంలను విజయ్ ఎరువుల ద్వారా అందించండి.

మోతాదు (ఎకరాకు కిలోలలో)

| పైరు | దుక్కిలో విజయ్ 14-28-14 |
|---|---|
| వేరుశనగ (సీటిసాగు) | 85 |
| వేరుశనగ (వర్షాధారం) | 50 |
| పప్పుదినుసు పైర్లు (వర్షాధారం) | 50 |

2. అధిక దిగుబడులకు విజయ్ ఎరువులను సరిఅయిన సమయానికి సరిఅయిన పద్ధతిలో వేయండి.
3. పసువుల పెంట, చెత్త చెదారాలను భద్రపరచి పొలంలో కలియ దున్నండి.

ఇంకా వివరాలు కావలిస్తే
ఈ క్రింది చిరునామా నుండి పుస్తకాలు
తెప్పించుకొని తెలుసుకొండి.




ఏరియా మేనేజర్
మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్
44, శాంతినగర్,
హైదరాబాదు-500 028









నాణ్యమైన, నమ్మకమైన విజయ్
ఎరువులను తయారుచేయువారు
**మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్**
మణలి, మద్రాస్ 600 068

MFL 2263

# ఉత్తరాలు

## ముఖచిత్రం

ది. 23—5—80 తేదీ వారపత్రిక ముఖచిత్రం నటి సీమ ఫోటో వేసారు. ఫోటో చూడడానికెంతో ఆనందంగానూ, ఎంతో ఆకర్షణగాను పుస్తకానికే వెలుగు తెచ్చినట్లు ఉంది. ఎందుకంటే ఎప్పుడూ సెక్స్ సీనుల్లో కనపడే ఆమె ఫోటో మా ఆంధ్రసచిత్ర వారపత్రికలో చూస్తూ వుంటే మన తెలుగు వారు వెలుగు తెచ్చినట్లు ఉంది. సంసారపక్షంగా ను ఉంది. అంతేగాక మధ్య పేజీలో సన్నాయి అప్పన్న చిత్రంలో శోభన్‌బాబు, జయప్రదగార్ల ఫోటో కలర్‌లో వేస్తే మరింతగా ఆకర్షించేది. అయినా భార్యా భర్తలు ఇంత అన్యోన్యంగా ఉండాలనిపించేటంత సరదాగా వేసారు. చాలా సంతోషం.

కె. వి. వి. ఎస్. మూర్తి [ వేలివెన్ను ]

*   *   *

16—5—80 తేదీ వెలువడిన పత్రికలో దీప ముఖచిత్రం మమ్మల్ని ఎంతగానో ఆనందపరచినది. షక్ట్రీట్‌మెంట్ కథ చాలా బాగుంది. కాంచనగంగ కథ చాలా రసవత్తరముగా నడుస్తున్నది. ఇంకా ముందు ముందు ఏమి జరుగుతుందోనని వచ్చే వారము పత్రికకై ఎదురు చూస్తున్నాము. కార్టూన్లు మమ్మల్ని ఎంతో ఆనందపరుస్తున్నవి. మరియు ఫాలాక్షుని డైరీ, బొమ్మంభారతం, ప్రశ్నావళి చాలా బాగున్నాయి.

బి. నరసింహ జ్వాలామణి [ కర్నూల్ ]

## ఫాలాక్షుని డైరీ

30—5—80 నాటి ఆంధ్రసచిత్ర వారపత్రిక మమ్మల్నెంతో ఆకర్షించింది. కాంచనగంగ సీరియల్, గడ్డి పరకలు చేపపూత కథలు చాలా బాగున్నాయి. కానీ ఫాలాక్షుని డైరీలో పాత సంఘటనలు, ఇంతకుముందు వరుసగా పేపర్లలో చదివిన విషయాలే మళ్ళీ వ్రాస్తున్నారు. అలాకాకుండా దేశంలో వారంవారం జరిగే సంఘటనలు, వెలుగులోనికి రానివి, మన తెలుగువారపత్రికల్లో రానివి ప్రచురిస్తే ఆసక్తిదాయకంగా ఉంటాయి కదా !

పాకనాటి జగదీశ్‌కుమార్ [ రాయపూర్ ]

## కథలు

23—5—80 పత్రిక ముఖచిత్రం సీమ మనోహరంగా ఉంది. కడలిలో వల కొత్త సీసాలో పాత సారాలా ఉంది. ఆకర్షణ వెనుక, వెన్నెల కథలు బాగున్నాయి. వెన్నెల కథ నిజంగా వెన్నెలంత చల్లగా, హాయిగా ఉంది. రచయితకు అభినందనలు.

కారుమూడి రమేష్, కుమారి ప్రేమస్వరూప [ ఎర్రగుంటపల్లి ]

(58వ పేజీ చూడండి)

# ★ వారఫలం ★

**20-6-1980 శుక్రవారం మొదలు**
**26-6-1980 గురువారం వరకు**

మేషం :— మీరుచేసే వ్యాపారంలో అనుకూలత ఏర్పడుటయేగాక పాతబాకీలు చాలా నిలిచి పోయాయిగదా ! అవి, వసూలయ్యేమార్గమున్నది. అభిమానుల ఆదరం, అభిమానం, అధిక గౌరవం సంక్రమించేవారం. వాదోపవాదాలలో చాల విధాల జాగ్రత్తగా ఉండాలిసిన గ్రహకూటమిగలదు. స్త్రీలకు: కళారంగంలో ప్రగతి, నూతన వస్తుసేకరణకు అనుకూలతగలదు.

వృషభం :— మీకు ధనాదాయం గలవారం. అప్రయత్న ధనలబ్ధి గలవారం. వ్యాపారం బాగుంటుంది. ఉద్యోగవృత్తులు బాగా సాగుతాయి. గనులలో పనిచేసే వారికి, వివిధరంగాలలోని కర్షకులకు ఉత్తమంగా ఉండేవారం. మీకు సంబంధించిన వస్తువులు పోతాయేమో ! జాగ్రత్త ! లలితకళా ప్రావీణ్యతగల వారికి మనోవాంఛా ఫలసిద్ధి కలదు. స్త్రీలకు: కార్యభారం అధికం.

మిథునం :— మానసికంగా బాగాయిబ్బందికలుగుతుంది. పనులకు అంతరాయాలుండగలవు. ముందు వెనుక లాలోచించి కార్యానుకూలత సాధించ తగియున్నది. వాహనాలు కొనుగోలు చేయుటకు చాలమంది ప్రయత్నిస్తారు. మాటకు విలువ పెరగటంతో అధిక గౌరవం సంప్రాప్తించ నున్నది. స్త్రీలకు : ఉద్యోగ వృత్తులలో ప్రగతి, ఆదాయం గలవారం.

కర్కాటకం : — అనేక విషయాలలో చికాకలుగుతుంది. బాగా ద్రవ్యార్జనకు అనుకూలత గలదు. నిర్మాణ కార్యక్రమం చాలా మందికి కొనసాగగలదు. ఇంటి శుభకార్యం జరుగుటకు అవకాశమున్నది. సంతాన విషయంలో, అప్రయత్నంగా చికాకు లేర్పడుతాయి. వారం చివరి రోజులలో ద్రవ్యాదాయం సంభవం. స్త్రీలకు : ఉద్యోగంవృత్తులలో సర్వానుకూలత ఏర్పడనున్నది. నూతన విషయాలు తెలిసికొనుట, క్రొత్త వస్తువులు సంపాదించుట జరుగుతుంది.

సింహం :— మీకు సంబంధించి, స్థిరచరాస్తులందు యిబ్బందులుండగలవు. అవి తీరాలంటే మధ్యవర్తుల సాయం అపేక్షించవలసి రావచ్చు. ఉద్రేక వాతావరణం ఏర్పడగలదు. ఎంతశాంతంగా పనులు సర్దుబాటు చేసికుంటే అంత మేలు. రాశిలో గల గ్రహాలు, ఎలాగైనా చికాకులు కలిగించనున్నవి. స్త్రీలకు : గృహకార్యభారం, పనులు కాకపోవటం, ఉద్యోగవృత్తులందు సామాన్య ఫలితం మాత్రమే చెప్పవచ్చు.

కన్య :— రాబడి చాల తక్కువ. అది చాలక యిబ్బందులుండగలవు. వెనుక చేసిన రుణం తీర్చలేక పోవటం, నూతనంగా వ్యాపారం ఆరంభిస్తే కొంత బాధాకరంగా ఉండటం గమనించగలరు. ఇరుగుపొరుగు వారితోగాని, ఆత్మీయులతో గాని ఘర్షణ పడాలసిన పరిస్థితులుండగలవు. శాంతం భూషణంగదా ! స్త్రీలకు : విలువగల వస్తుసేకరణతో, సంతాన విషయంగా అధికవ్యయం సంభవమయ్యేవారం. ఆరోగ్యలోపంలేదు.

తుల :— రాశికి ఏకాదశంలో స్థితులైన గ్రహాలు మీకు అధికాదాయం చూపించనున్నది. నల్లని వస్త్రాలు యంత్రాల మూలంగా జరుగదగిన వ్యాపారం లాభదాయకం. ఉద్యోగంలో అనుకూలత గలవారం. కొందరు ప్రమోషన్ ఆశించవచ్చు. శుభ కార్యానుకూలత గల వారం. బంధు వర్గీయులు యిల్లు చేరటం, మిత్రుల మూలాన నెరవేరదగిన పనులు సులువుగా లాభదాయకంగా నెరవేరతాయి. స్త్రీలకు: అన్నింటా శుభయోగమే.

వృశ్చికం :— కోర్టు వ్యవహారాలలో స్తంభన ఏర్పడుతుంది. చాల వ్యవహారాలు మధ్యవర్తి ద్వారా నెరవేరగలవు. స్త్రీల మూలాన కీచులాటలు రావచ్చు. చేయిజారిన ధనంగాని, వస్తువుగాని మరలా లభించే యోగంలేదు. అనారోగ్యత సంభవం. విలువగల వస్తుసేకరణ చేయగలరు. స్త్రీలకు: చుట్టుపక్కల వారితో యిబ్బందులుండగలవు. కార్యభారంఅధికం.

ధనుస్సు :— మీ వ్యాపారం లాభదాయకం. వ్యవహారాలలో విజయవంతమైన వారం. ముఖ్యబంధువులు యింటికి రాగలరు. ప్రముఖమైన వ్యవహారాలలో ఏ మాత్రం ఆలస్యం జరుగదు సరిగదా! ఆర్థికంగా, లాభదాయకంగా పరిణమించగలవు. మీకు సంబంధించిన వస్తువులు పోయే సూచన గలదు. . సంతాన విషయంగా ఆందోళన కలిగించే వారం. స్త్రీలకు : కళారంగంలో అవకాశాలుండగలవు. ఉద్యోగంలో యిబ్బంది కనిపించదు.

మకరం :— మీ ఆరోగ్య విషయంలో శ్రద్ధాసక్తులు చూపాలి. చాలమందికి ముఖ్యంగా వయసు మీరినవారికి ఔషధసేవ అవసరం కావచ్చు. స్త్రీలకు : ఉద్యోగవృత్తులు అనుకూలంగా ఉండగలవు. వయసు వచ్చినవారికి, చాల కాలంగా ఆగిన శుభకార్యం ఈ వారంలో ఒకరేవుకు రాగలదు. కళారంగ ప్రగతి సంభవం.

కుంభం :— ముఖ్య మిత్రుల వలన మీకు కార్యానుకూలత సంభవం. వివాదగ్రస్తమైన విషయాలు, మధ్యవర్తుల వలన పరిష్కారం కాగలవు. కోర్టు కచ్చేరి వ్యవహారాలు మీకు అనుకూలంగా పరిష్కారం కాగలవు. కథకులకు, పత్రికాధిపతులకు, గాయకులకు అనుకూలమైనవారం. స్త్రీలకు : ఉద్యోగవృత్తులు లాభదాయకం. ఆర్థికంగాఉత్తమ ఫలప్రదాయకమైన వారం.

మీనం :— ఏవేవో ఎత్తులు వేస్తారు. చాల ప్రశాంతంగా, ఆలోచించిగాని పనులకు దిగరాదు. మాటల మూలాన మిత్రులను శత్రువులనుచేసికో బోతారు. జాగ్రత్త ! ఆర్థికంగా కొంత ఉత్తమ ఫలితంగలవారం. స్త్రీలకు : లాభించగల వారం. వ్యాపారం చేసే వారికి ఉత్తమ ఫలప్రాప్తి. ఆరోగ్య లోపంలేదు.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి



సీరియల్

# జీవితగమ్యం

## శ్రీమతి యర్రగుంట్ల వరలక్ష్మీదేవి

*(గత సంచిక తరువాయి)*

"మన కోమలికి మీ చెల్లెలు కాంతం పెద్దకొడుకు శేఖర్ కిచ్చి పెళ్ళి చేస్తే బాగుంటుంది కదండీ."

"చాల బాగుంటుంది."

"ఆ అబ్బాయి చాల తెలివైన వాడని విన్నాను. క్లాసులో ఫస్టు వస్తున్నాడట — చక్కగా ఉంటాడని విన్నాను."

"మాడు పిసలా — మన కోమలికి వయస్సు పదిసంవత్సరాలు. శేఖర్‌కి పదహారు సంవత్సరాలు. ఇంకా మరో పదేళ్ళు గడుస్తే గాని ఈ పెళ్ళి ప్రసక్తే ఉండదు కదా, ఇప్పుడెందుకివన్నీ? నిద్రొస్తోంది, హాయిగా పడుకో. నాకు మన పెండ్లి ముచ్చటే ఇంకా తీరలేదు. మన పిల్లలకు పెండ్లేమిటి!"

"అలా కాదండీ — మనం మొదటి నుండి ఒక ఉద్దేశం పెట్టుకోవాలి. నే నడుగుతే కాంతం ఒప్పుకుంది. కాంతం మన కోమలిని ఒక్క నిముషం వదిలేది కాదు."

"పిరిదానా — ఈ చిన్నాటి ముచ్చట్లు పెద్దయ్యేక ఉండవు. అప్పుడు కట్నాలు మాట్లాడుతారు. అప్పుడు ఈ అనుబంధాలు, బాంధవ్యాలు ఏవీ ఉండవు. మా రాఘవరావు బావ. అంత తిన్నని వాడు కాడు. ఒకవేళ నేనుకున్నా పదివేలు పుచ్చుకోందే ఒప్పుకోడు. నీకు తెల్సు కదా — నేను పైసా కట్నమివ్వదల్చుకో లేదు, పుచ్చుకోదల్చుకోలేదు."

"మీ బావగారి సంగతి నాకు తెలీదుకానీ, మా వదిన కాంతం మాత్రం చాల మంచి మనిషి. కట్నాల్ని, కానుకల్ని ఆశించేమనిషి కాదు."

"సరేఒప్పేసుకున్నానుగా — మన కోమలిని పదిసంవత్సరాల తరువాత అప్పటికి ఇంజనీరుగా పని చేసే శేఖర్‌కిచ్చి వివాహం చేయడానికి పెద్దలు పది సంవత్సరాల ముందరే నిర్ణయించుకోవడమైంది. తరువాత మన భాస్కర్ పెండ్లి నిశ్చయం చేసేసెయి. పనిలో పని అయిపోతుంది."

"మా అన్నయ్య కూతురు మూడవది సరోజ లేదూ — దాన్నిచ్చి చేద్దాం. మనం యెలాగా కట్నాలు పుచ్చుకోము. మా అన్నయ్య ప్లీడరు గుమస్తా గనుక యెలాగు ఇచ్చుకోలేడు. అందుకే సరిపోతుంది. సరోజ అందమైంది. మన కోడలైతే బాగుంటుంది — ఏమంటారు?"

"సరే అలాగే చేద్దాం. ఈ విధంగా పుణ్యమూ, పురుషార్థమూ కలిసి వస్తాయి. ప్రస్తుతం నాకు చాల చలిగా వుంది. లేచి దుప్పటి తెచ్చుకునె ఓపిక లేదు కనుక మరి కాస్త దగ్గరగా రా."

"నాకు తెల్సునండీ మీ యెత్తులు — మీరు..."

గోపాలం విమలమ్మను సరి మాట్లాడనివ్వ లేదు. కాస్సేపటికి గోపాలం చలి పూర్తిగా పోయింది. విమల ఏదో మాట్లాడుదామన్నా మాటలు రాలేదు. హాయిగా కళ్ళు మూతలు పడ్డాయి.

ఆ మరునాడు ఆఫీసుకు శలవు పెట్టి గోపాలం, అతడి అన్నయ్య బలరాం ఒంట్లో బాగులేదని తెల్సి చూడడానికి రాజాంకు బస్సులో బయలు దేరేడు.

---

**జరిగిన కథ 1:** విమలమ్మ భర్త గోపాలం బ్యాంకులో హెడ్ అకౌంటెంటుగా పని చేస్తుంటాడు. వీరి పిల్లలు భాస్కర్, కోమలి. గోపాలం బావ రాఘవ రావు విలాస పురుషుడు. ఉద్యోగంలో చేరిన దగ్గర్నుండి గోపాలం కూడబెట్టిన డబ్బును, వ్యాపారంలో నష్టమొచ్చిందనే నెపంతో రాఘవరావు నోటు వ్రాసి తీసు కుంటాడు.

---

గుమ్మంలో దిగ్గానే బలరాం రెండో కూతురు లక్ష్మి "చిన్నాన్న వచ్చారే" అని వాళ్ళమ్మకు చెప్పి, దగ్గరగా వచ్చి చేతిలోని పెట్టె అందుకుంది. బలరాంకు ముగ్గురమ్మాయిలు, ఇద్దరబ్బాయిలు సంతానం. పెద్దమ్మాయికి వివాహం చేసేశారు. రెండో అమ్మాయి లక్ష్మి పద్దెనిమిదేళ్ళ వయసుంది. మూడవది మణి పన్నెండేళ్ళది.

"ఏం వదినా అంతా కులాసాయేనా?"

"ఏం కులాసా బాబూ. మీ అన్నయ్యకు పదిరోజుల్నుంచి జ్వరం, తగ్గటంలేదు. నిన్ను చూడాలని కోరితే ఉత్తరం వ్రాయించాను"

గోపాలం గదిలోకి వెళ్ళి అన్నయ్య మంచం ప్రక్కని స్టూలు లాక్కుని కూర్చున్నాడు. బలరాం చాలా నీరసంగా ఉన్నాడు. తమ్ముణ్ణి చూడంగానే ఆనందంతో కండ్లు మెరిశాయి.

"తమ్ముడూ — వచ్చావా? విమలమ్మ పిల్లలు క్షేమమేనా?"

"అందరూ కులాసాగానే ఉన్నారు. నీ కిప్పుడెలాగుంది?"

"పది రోజులైంది జ్వరం వదలడం లేదు. ఏదేం జ్వరమో తెలీదు. డాక్టరు తగ్గి పోతుంది, ఫరవాలేదు అంటున్నాడు — ఏమో!"

"చాల నీరసించి పోయావు అన్నయ్యా! ఇన్నాళ్ళు వదలలేదంటే ఏదో టైఫాయిడు జరమై వుంటుంది. నేను డాక్టర్ని కనుక్కుంటాలే. ఏమి తీసుకుంటున్నావు?"

"బార్లీ నీళ్ళు, రోజుకు రెండు సార్లు హార్లిక్స్ ఇవాళ కాస్త తలబాధ తగ్గినట్టుంది. ఏదో నిన్ను చూడాలనిపించింది, ఉత్తరం వ్రాయించాను."

"మంచిపని చేశావు."

భోజనాలయ్యాక గోపాలం స్నానం చేశాడు. పిల్లలంతా చిన్నాన్నతో చాలా సరదాగా మాట్లాడారు. గోపాలమంటే వాళ్ళకెంతో ప్రేమ. డబ్బు, సంపద లేని వాళ్ళకు మరి మిగిలింది ఆదరణ, ఆప్యాయతలే కదా! మొదట్నుంచి బలరాంకీ, గోపాలంకీ అంతటి అనుబంధముంది. పెద్దయ్యేకకూడా వాళ్ళ అనురాగాలు అంతరించి పోకుండా చిగురిస్తూనే ఉన్నాయి. ముఖ్యంగా బలరాం కుటుంబానికీ, గోపాలం కుటుంబానికి యెంతో అన్యోన్యత. తను వాటా ఇల్లు గోపాలం కొనుక్కున్నప్పుడు

కూడా వాళలో ఏ అసూయ ద్వేషాలు రగుల్కొలేదు. పైగా తమ్ముగా ఆ పిత్రార్జితమైన ఇంటిలో ఉంటున్నందుకు బలరాం సంతోషించాడు.

గోపాలం రెండు రోజు లుండదల్చేడు. తన వచ్చిం తరువాత వాళందర్కి ఎంతో ధైర్యం కల్గిందని గ్రహించాడు. సాయంత్రం పిల్లలేదో ఆడుకుంటున్నారు. రామలక్ష్మమ్మ వంటకి ఏదో ఏర్పాటు చేస్తూంది గోపాలం అన్న దగ్గర కూర్చున్నాడు. డాక్టరు మధ్యాహ్నం వచ్చి వెళ్ళేడు, మరేం భయంలేదు జ్వరం క్రమేపి తగ్గిపోతుందని చెప్పేడు. బలరాం ఏదో దిగులుగా ఉన్నాడు. ముఖంలో ఏవో ఛాయలు అలుము కున్నాయి. గోపాలం అది గమనించేడు.

"ఏమన్నయ్యా! ఏమైనా బాధగా ఉందా? జ్వరం తగ్గిపోతుందని డాక్టరు చెప్పేరు కదా, నువ్వు బెంగపెట్టుకోకన్నయ్యా."

"గోపాలం నీకు తెలియదు. నా ఆరోగ్యం బాగా పాడయి పోయింది. అడపా తడపా యేదో ఒకటి వస్తూంది. నాకెందుకో భయంగానే ఉంది తమ్ముడు! ఈ మారు లేవలేనేమోనని."

"అదేం మాటలు అన్నయ్యా! నీకేం పరవాలేదు. ఆ భగవంతుని నమ్ముకో! అన్నీ సవ్యంగా జరుగుతాయి."

"తమ్ముడూ! నాకేమైనా అయితే నా కుటుంబాన్ని కాస్త ఆదుకోవాలి. వాళ్ళు బజారున పడకుండా చూడాలి."

"ఏందు కన్నయ్యా అట్లాంటి అపశకున మాటలు. నీకే ప్రమాదం లేదు. నీ కుటుంబం వీధిన పడే అవసరం రాదు — సరేనా? నువ్వు భయపడి అందర్నీ బెంబేలు పెట్టకు."

"సరే-నాకు తెల్సు, నా కుటుంబాన్ని దిక్కులేని వాళ్లను చెయ్యవని. తమ్ముడూ! నా మనస్సులో మరో గుబులుందిరా- యెలా చెప్పుకోను?"

"ఏమిటన్నయ్యా! అంత బాధాకరమైన విషయం- నాతో చెప్పు."

"మన లక్ష్మి సంగతేరా. పెద్దదానికి వివాహం చేసేను, బుద్ధిగా కాపురం చేసు కుంటూంది. సీత చాల మంచి పిల్ల. అల్లుడు బుద్ధిమంతుడు. ప్రయోజకుడు. వాళ్ల సంసారం బాగుంది. కాని ఈ రెండో పిల్ల లక్ష్మి అదోలాంటిది. స్కూలు ఫైనల్‌తో దీని చదువు మాన్పించడం వల్ల పొరపాటు చేసేనేమో అనుకుంటున్నాను."

"సంగతేమిటి? లక్ష్మి అలాంటిది కాదే."

"ఏమో! ఆ యెదురింటి నాయుడు కుర్రాడితో చనువు పెంచుకుంటూందని మాకు అనుమానంగా వుంది. ఆ మధ్య ఓనాడు డాబా పైన నించుని లక్ష్మి ఆ కుర్రాడికి ఏవో సౌంజ్ఞలు చేస్తుంటే వాళమ్మ చూసి నాలుగు తగిలించి క్రిందకు తీసుకుని వచ్చింది. ఓనాడు లక్ష్మి చదువుతున్న పుస్తకంలో ఓ ఉత్తరాన్ని చూసి దాని చెల్లెలు మణి వాళ్ళమ్మకు తీసుకొని వెళ్ళింది. ఆ ఉత్తరం నేను చదివేను. అది ఆ నాయుడు కుర్రాడు లక్ష్మికి వ్రాసేడు. వాళ పరిచయం కాస్త ముదురుతోంది. ఆ కుర్రాడు బి. ఏ. చదువుతూ మానేసేడు. ఇంకా ఉద్యోగం సద్యోగం లేదు. పైగా మన కులం కాదాయె స్వకుల వివాహాలే ఇంత చక్కగా వెలిగిపోతుంటే, కులాంతర వివాహాలు యెలాగుంటాయో నాకు తెలియడంలేదు. అందులో బోలెడన్ని సమస్యలు



ముఖ్యంగా ఆహార సమస్య మనం యెంత లెదముకున్నా తరువాత క్లిష్ట సమస్యగానే పరిణమిస్తుంది. అలాగే బంధువులు, ఆచార వ్యవహారాలు. ఏమో ఇవన్నీ తల్చుకొంటుంటే నాకు మతి పోతూంది. ఏం చెయ్యాలి తమ్ముడూ?"

"మరేమి దిగులు పడకు. ఏదో చిన్నతనం, తెలిసీ తెలియని జ్ఞానం. నా వెంట లక్ష్మిని పంపు. మా దగ్గర కొన్నాళ్లుంటుంది. వీలంటే నువ్వీ ఇల్లు వదిలేసి మరో వీధిలో ఇల్లు తీసుకోడం మంచిది. లక్ష్మి మా ఊరు నుండి తిరిగి వచ్చేలోగా ఇల్లు మార్చేయి."

"నీ ఉద్దేశం బాగానే ఉందిగాని, ఈ పరిస్థితిలో ఎలా పంపించను?"

"ఓ పని చెయ్యి అన్నయ్యా— నీ జ్వరం తగ్గగానే వ్రాయి. నేను వస్తాను. నిన్ను చూసినట్లవుతుంది, లక్ష్మిని తీసుకుని వెళ్ళినట్లు అవుతుంది."

"అలాగే చేస్తాం— ఈ విషయాన్ని నీ కడుపులో ఉంచుకో."

"ఎంత మాటన్నయ్యా! నీ కూతురు ఒకటీ నా కూతురు ఒకటీనా! నీ మర్యాద నా మర్యాద కాదా!"

"నీ సంగతి నాకు తెల్సు తమ్ముడూ."

"అన్నయ్యా! అనవసరంగా నీ గురించిగాని, లక్ష్మి గురించిగాని దిగులు పెట్టుకోకు. నా చేతనయినంత సహాయం నేను చేస్తాను. అన్నింటికి ఆ భగవంతుడున్నాడు."

ఆ మరునాటికి జ్వరం నూట మూడు డిగ్రీలకు దిగింది. మరేం ఫరవా లేదన్న ధైర్యం అందరికీ కల్గింది. గోపాలం సాయంకాలం బస్సుకు ప్రయాణం అవుతూ అన్న దగ్గరకు వెళ్ళేడు.

"అన్నయ్యా! నువ్వు మరోలా అనుకోకపోతే నాదో చిన్న రిక్వెష్టు. నీకేమన్నా మందులకోసం అవసరం పడొచ్చు, ఈ నూరు ఉంచు."

"ఏమిటి తమ్ముడూ— నాకిప్పుడు డబ్బెందుకు? నువ్వు వచ్చేవు, అదే నాకు సంతోషాన్ని ధైర్యాన్ని కల్గించింది."

"నీకు మందులకు, పండ్లకు చాల డబ్బవుతూంది. నేనేమి నీకు పండ్లు తేలేదు— కాదనకు, నా తృప్తికోసం ఈ డబ్బుంచు" అని అన్నయ్యను బలవంతం చేసి ఆ వంద రూపాయల్ని చేతిలో పెట్టాడు. వదిన రామలక్ష్మమ్మ కండ్లు కృతజ్ఞతతో చెమర్చేయి.

"బాబూ! నువ్వు చాలా యోగ్యుడవు. మీ అన్నయ్యకు అభిమానం అడ్డు వస్తుందే గాని నిజానికి ఆ డబ్బు ఇప్పుడవసరమే."

"ఒకళ్ళనొకళ్ళం ఆదుకోకపోతే ఎలాగ ఒదినా! అన్నయ్య ఒంట్లో ఎలాగున్నది తెలియజేస్తుండు. ఏమైనా డబ్బు అవసరం వస్తే మొహమాట పడక నాకు వ్రాస్తే, నేను పంపిస్తా. అన్నయ్య డబ్బు గురించి నాకు వ్రాయడు. అందుకే నీకు చెప్తున్నాను ఒదినా!"

"అలాగే బాబూ! విమలమ్మను పిల్లలను అడిగేనని చెప్పు."

ఆ నాటి సాయంత్రం బస్సులో తన ఊరు వచ్చేసాడు గోపాలం.

## 5

విమలమ్మకు ఒక అన్న విశ్వనాథమని శ్రీకాకుళంలో ఉన్నాడు. అతడు ఓ ప్రముఖ ప్లీడరు వద్ద గుమాస్తా పని చేస్తున్నాడు. అతడికి ముగ్గురు కుమార్తెలు, ఒక కొడుకు. పిల్లలు ముగ్గురికి వనజ, గిరిజ, సరోజ అని పేరు పెట్టాడు. పుత్రుడి పేరు సత్యం. విశ్వనాథం చాల పెద్ద మనిషి, ప్లీడరు గుమాస్తా అనేసరికి తిన్నవైన వాడు కాదు అనే భావన కల్గినప్పటికీ అతడు చాల మంచి మనిషి. విమలమ్మకు తగిన అన్నయ్య. విమలమ్మకు మల్లే బంధుప్రీతి కల్గినవాడు. ఆడపిల్లలు తండ్రికి మల్లే వినయ, విధేయత లున్నవారు. విటొచ్చి విశ్వనాథం భార్య జగదాంబ మట్టుకు గొప్ప నోటి దురుసు మనిషి. ఆవిడదే పై చెయ్యి. ఆవిడ నోటికి దడిసి, ఆట్టే ఇంటి వ్యవహారాల్లో కలుగజేసుకోడు విశ్వనాథం.

కొడుకు సత్యం అమ్మ తర్ని పోలికే. అప్పటికి వాడి వయస్సు పదహారు సంవత్సరాలు. బహు దుడుకైనవాడు. చదువులో తాపీ, అందుకే ఇంకా తొమ్మిదవ తరగతే చదువుతున్నాడు. తల్లికి వాడంటే అమితమైన ప్రేమ. వాడు చేసిన ఏ దుండగాలైనా ఆమె చిలిపిచేష్టలుగానే పరిగణిస్తుంది. పెద్దమ్మాయి వనజకు ఇరవై యేళ్ళు. స్కూలుఫైనలు పాసయింది. చైతగ్గా వైశగ్గా ఒక సంబంధం కుదిరింది. ఆ అబ్బాయి బరంపురంలో టెలిఫోను ఆపరేటరుగ పని చేస్తున్నాడు. ఆ పెండ్లికి గోపాలం కుటుంబాన్ని తీసుకుని శ్రీకాకుళం వెళ్ళాడు.

పెండ్లివారిల్లు కళకళ లాడుతోంది. తోరణాలతో వచ్చగా వుంది. గోపాలం రాగానే విశ్వనాథం ఆప్యాయంగా లోపికి తీసుకుని వెళ్ళాడు. జగదాంబ ...దరంగా



# తెల్లదనానికి మొదటిది
# ప్రకాశానికి మొదటిది

TATA'S
501
BLUE DETERGENT BAR

# నీలం 501
## డిటర్జెంట్ బార్

"హెచ్చు
ఉతికే శక్తి!
హెచ్చు పొదుపు"



"ముద్ద కాదు, ఎక్కువ
రోజులు వస్తుంది.
ష్కలమైన నురుగు!"

## మరొక 501 విజేత

HA3T-5-253 TL

టాటావారి తయారీ

విమలమ్మను పలుకరించింది. విమలమ్మ పెళ్ళిందగ్గర్నుండి, పెండ్లి యత్నాలలో పడింది. మరి మూడు రోజుల్లోనే పెండ్లి. ఎంతో ఉత్సాహంతో ప్రయత్నాలన్నీచేశారు. భాస్కర్, సత్యం కలిసిపోయేరు. తెగ తిరిగేవారు. సరదాగా కబుర్లు చెప్పుకున్నారు. సరోజ, కోమలి సమవయస్కులు. ఇద్దరు స్నేహితులయ్యేరు. ఇద్దరు అందమైన వాళ్ళు, మరుకైన వాళ్ళు. ముచ్చటగా జడకుచ్చులతో, చిన్న పరికిణీలతో సందడిగ తిరుగుతుంటే, ఆ పెండ్లింటికే శోభ వచ్చింది.

ఓనాడు కోమలి గదిలోకి దేనికో వెళ్ళే సరికి, బావ సత్యం విశ్వనాధం జేబులో మంచి ఐదురూపాయల నోటు ఇటు అటు చూసి తీసి తన నిక్కరు జేబులో దాచేయడం గమనించింది. మధ్యాహ్నం విశ్వనాధం ఆ నోటు కోసం వెతుక్కుని సత్యాన్ని అనుమానించి అడిగేడు. సత్యం తనకేమి తెలియదని దబాయించేడు. విశ్వనాధం గట్టిగా అడిగే సరికి తల్లి చాటుకు చేరి దొంగ యేడ్పు మొదలెట్టేడు. జగదాంబ భర్త మీద విరుచుకు పడింది.

"మీకు మతిపోతూ ఎక్కడ పడేసుకున్నారో చూసుకోండి. చిన్న వెధవ వాడి మీద అనుమాన పడ్తారేమిటి? పెండిలో పదిమంది మసలుతారు, వాడే తీసేడని నిర్ధారణేమిటి? నలుగురిలో వాడికి, నాకు తల వంపులు తేవడానికి గాని ఇవేం బుద్ధు

# జీవితగమ్యం

లండి మీవి. నిజం తెల్సుకోకుండా, వాడ్ని దొంగ చేసేరంటే నేను ఒప్పుకునేది లేదు—ఆఁ"

విశ్వనాధం ఆమె నోటి ధాటికి కాస్త తగ్గిపోయేడు.

"నేనేదో వాడ్ని రహస్యంగ గదమాయిస్తే, నువ్వేమిటీ ఇంతగా అరుస్తున్నావు. ఇంటి గుట్టు నువ్వే రట్టు చేస్తున్నావు పోతే పోనీ ఐదురూపాయలేగా ఇక నోరు మూసుకో."

"మూసేనా వదినా. మీ అన్నయ్య భాగోతం. ఎంత నాటకాలాడేస్తే అంతమాటనేస్తున్నారు. నేను నోరు పారేసుకుంటున్నానా? నువ్వే చెప్పు కన్నపిల్లల్ని దొంగలుగా అనుమానిస్తే యెలా చెప్పు మొగ పెళ్ళి వారికి తెలుస్తే ఎంత నామర్దా! పెండ్లికూతురు తమ్ముడు దొంగంటే, పెండ్లి కూతురు వంశమే దొంగ అనుకోరు!"

"ఊరుకో వదినా, ఎవరైనా వినగలరు. స్వల్ప విషయానికింత రాద్ధాంతం చేయకండి" అని వాళ్ళ నోరు నొక్కింది. ఇంతలో కోమలి అక్కడకు వచ్చింది. వాళ్ళ మాటలన్నీ వింది. అమాయకురాలు నిజం చెప్పేసింది.

"ఏమిటి మామయ్యా — నీ అయిదు రూపాయల నోటు పోయింది కదూ, నాకు తెల్సు ఎవరు తీసేరో."

"ఎవరు తీసేరో చెప్పమ్మా" అనునయంగా, సత్యం బావని అనుమానిస్తున్నారు."

"సత్యం బావే తీసేడత్తయ్యా. నేను ప్రొద్దున్న చూసేను. మామయ్య జేబులోనుండి తీసి నిక్కరు జేబులో దాచేసి పారిపోయేడు."

"ఏంరా వెధవా! నీ పని చెప్తానుండు." విశ్వనాధం కొడుకు మీద చెయ్యి చేసుకోబోయేడు. కాని, వాడు ఘటికుడు. తప్పించుకుని వీధిలోకి పారిపోయాడు.

"ఎవర్ని చూసి ఎవరనుకుందో, పసిపిల్ల దానికేం గుర్తు" సర్దుకోబోయింది జగదాంబ తన ముద్దుల కొడుకు దొంగతనం చేసేడంటే మనస్కరించక.

"అన్నయ్యా! అక్కడికి ఆ సంగతి వదిలేయి మగ పెండ్లివారి తాలూకు మనుష్యులెవరో వచ్చినట్టుంది. వింటే సిగ్గుచేటు. ఆ విషయాన్ని మరచిపోయి మిగతా పనులు చూడు" అని విశ్వనాధాన్ని ఆ గదిలోనుండి పంపించేసింది. జగదాంబ మొగుడి వైపు గుర్రుగా చూసి వంటశాల వైపు వెళ్ళిపోయింది.

ఆ సాయంత్రమే కోమలి ఒంటరిగా దొరికితే కోపంచేత జడని పట్టుకుని గుంజి ఒక దెబ్బ వేసేడు సత్యం. కోమలి సన్నగా ఏడ్వడం మొదలెట్టింది. ఈ విషయాన్ని చెల్లెలు చెప్పగ విని భాస్కర్ సత్యాన్ని రెండు తిట్టేడు. దాంతో స్నేహితులిద్దరు విడిపోయేరు.

పెండ్లిలో సరోజను సరదాగా దగ్గరకు తీసుకుని, 'నా కోడలు పిల్లని' యెంతో మురిపెంతో అందరికీ విమలమ్మ చెప్పేది. 'ఆ మాట నిలుపుకోవాలి వదినా' అని మరీ హెచ్చరించింది జగదాంబ ఆడపడుచు విమలమ్మను.




"ఏం బావా! మాట్లాడక ఊరుకున్నావు?" అని గోపాలాన్ని అడిగేడు విశ్వనాదం.

"నేనేం మాట్లాడేది. ఇంతకు ముందే మీ తరపున మీ చెల్లెలు వకాల్తా పుచ్చుకుంది. తప్పుతుందా మరి."

"ఏం మా సరోజకు ఏం లోటని అంత నీట్లూరుస్తూ వచ్చుకుంటున్నావు?"

"చూడు బావా— వైవాహిక సంబంధమైతే బోలెడంత కట్నం, కానుకలు వస్తాయి.

# "హెర్క్యులిస్ సైకిల్‌ని అమర్చడంలో ఏ విధమయిన సమస్యా లేదు... అంతే కాదు, దీనిని కొన్నవారు ఎవరూ ఫిర్యాదు చేయడానికి అవకాశమే లేదు"



యస్.ఆర్. ముత్తుస్వామి
సైకిల్ మెకానిక్, సేలం, తమిళనాడు-

సైకిల్‌ని అమర్చడం సులభమయిన పని కాదు. కాని, హెర్క్యులిస్ సైకిల్ తీసుకుంటే ఆ పని నాకెంతో సంతోషం కలిగిస్తుంది. హెర్క్యులిస్ ప్రతి విభాగమూ సరిగ్గా సరిపోతుంది— అమర్చేటప్పుడు కష్టపడి సర్దుబాటు చేయవలసిన పని వుండదు. నిజానికి, ఒక గంటలోపునే హెర్క్యులిస్‌ని నేను అమర్చగలను. (కొన్ని సైకిళ్ళకి, ఆ పనికి రెండు గంటలవరకూ పడుతుంది) హెర్క్యులిస్ సైకిల్‌ని అమర్చడంలో కాలం మిగుల్తుంది, శ్రమా తగ్గుతుంది. అంతేకాదు, దీనిని కొన్నవారు ఎవరూ ఫిర్యాదు చేయడానికి అవకాశమే లేదు. హెర్క్యులిస్ నాణ్యత గురించి అనేక మంది సైకిల్ మెకానిక్‌లు ఘనంగా చెప్పడానికి ఎన్నో సబబయిన కారణాలు వున్నాయి.

## హెర్క్యులిస్ : పరీక్షించడంలోనూ, నాణ్యతా విధానాలు అమలు పెట్టడంలోనూ పూర్తి శ్రద్ధ తీసుకుంటారు.

ప్రతి హెర్క్యులిస్‌కి ముడిపదార్థాలని పరీక్షించడంతో సహా 67 పరీక్షలు విడిగా చేస్తారు.

ప్రతి బ్యాచ్ నుంచి ఒక హెర్క్యులిస్‌ని తీసుకుని 'చిత్రహింస' పరీక్ష చేస్తారు— అంటే ఒక వారం రోజులు విరామం లేకుండా తిరిగేటట్లు చూడడం!

రిమ్ములు, ట్యూబ్‌లు మరియు టైర్లు డన్‌లప్ నుంచే కొంటారు. (టిఐ సైకిల్స్, శ్రేష్ఠమయినవాటినుంచే కొంటుంది.)

## మీ హెర్క్యులిస్: సులభంగా ప్రయాణం చేయడానికి వీలుగా ప్రత్యేకమైన బాల్ బేరింగ్‌లు

రెండు పూర్తి వరసల హై-క్రోమ్ స్టీల్ బాల్స్ సులభంగా ప్రయాణం చేయడానికి వీలుగా వుంటుంది. మరియు ఎక్కువ బరువులు తీసుకువెళ్ళేటప్పుడు సులభమయిన ఫ్రీ-వీలింగ్‌కి తోడ్పడతాయి. హెర్క్యులిస్ బాడీ హై-బేక్‌డ్ ఎనామిల్ మరియు హెవీ క్రోమియమ్ ప్లేటింగ్‌లతో తుది మెరుగులు యివ్వబడింది. ఫలితం : మీ హెర్క్యులిస్ సైకిల్ తన అందమయిన ఆకారాన్ని సంవత్సరాల తరబడి కాపాడుకుంటుంది.



 హెర్క్యులిస్

[TIC-2251]

# జీవితగమ్యం

"నువ్వేమివ్వగలవు నన్నాపివి" అని ఛలోక్తి విసిరేడు గోపాలం.

"అన్నయ్యా! మీ బావగారి మాటలు నమ్మకు. ఆయన కట్నాలు, కానుకలు పుచ్చుకోరు, ఇవ్వరు."

"ఏదో మా శక్తి మేరకు మేమూ ఇస్తాములే వదినా" అని జగదాంబ పౌరుషంగా చెప్పుకుంది.

"మాకేమి వద్దులే అమ్మా— బావగారితో హాస్యమాడేను, అంతే. మా భాస్కర్ ప్రయోజకుడు కాగానే నేనే కబురంపుతా ముహూర్తం పెట్టించమని. సరేనా? సరోజకన్న మంచిది, అందమైంది మా కోడలుగా మరెక్కడ దొరుకుంది?"

గోపాలం చేసిన ఈ వాగ్దానం అందరికీ సంతోషం కల్గించింది.

వనజకు పెండ్లయిన మూడు రోజులకు గోపాలం కుటుంబాన్ని తీసుకుని తనవూరుకు ప్రయాణమయ్యేడు. ఇంటికి చేరుకుని తలుపులు తెరిచేసరికి ఓ ఉత్తరంపడుంది. ఆ ఉత్తరం రాజాం నుండివచ్చింది.

బలరాం ఆరోగ్యం బాగుపడింది. మళ్ళీ మామూలు మనిషై ఉద్యోగం చేసుకుంటున్నాడు. కాని ఒకే ఒక దుర్ఘటన జరిగి అతడ్ని అధఃపాతాళానికి అణగదొక్కింది. గౌరవంగా యెంతో ఆత్మాభిమానంతో బ్రతుకుతున్న ఆ కుటుంబం ఆ ఒక్క సంఘటన వల్ల, సమాజంలో గౌరవం పోగొట్టుకుని తల యెత్తుకుని తిరగలేని స్థితికి వచ్చింది. గోపాలం శ్రీకాకుళంలో పెళ్ళికి వెళ్ళి వారం రోజుల తరువాత తిరిగి వచ్చేడు. ఆ క్రితం రోజునే గోపాలాన్ని వెంటనే రమ్మని రాజాం నుండి ఉత్తరం వచ్చింది.

సభరావడి ఆ సాయంత్రం. బస్సుకే గోపాలం ప్రయాణ మయ్యేడు.

బలరాం ఇంట్లో కాలు పెట్టగానే, బలరాం మూడవ కూతురు మణి గోపాలం దగ్గరగా వచ్చి చెయ్యిపట్టుకుని యేడుస్తూ "చిన్నాన్నా! లక్ష్మక్క మొన్న నెక్కడికో వెళ్ళిపోయింది" అని చెప్పింది. భయపడ్డది జరిగిపోయింది.

గదిలోని దృశ్యం మరీ విషాదంగా వుంది. మంచం మీద నీరసంగా పడుకున్నాడు బలరాం. ప్రక్కనే నేలమీద కూర్చుని మంచం మీద తల ఆన్చి యేడుస్తూంది రామలక్ష్మమ్మ. పి యు. సి చదువుతున్న పెద్దవాడు ప్రభాకరం గదిలో కిటికీ దగ్గర నిల్చున్నాడు. ప్రభాకరం పదహారేళ్ల వాడు. ఆఖరి వాడు ఎనిమిదేళ్ళ రాజా దిక్కుముఖం వేసుకుని తల్లి భుజం మీద చెయ్యి వేసి వింటున్నాడు.

గోపాలాన్ని చూడగనే బలరాం అంత నీరసంలోను భోరుమని యేడ్చేసేడు. గోపాలం మంచం మీద కూర్చుని అన్న చేతిని తన చేతిలోకి తీసుకుని "ఎలా జరిగింది అన్నయ్యా?" అని అడిగేడు.

"నీకు చెప్పేను కదా, అదే ఆ యెదురింటి వెధవతో మొన్న సాయంత్రం లేచి పోయింది. పోతూ ఒక ఉత్తరం ఆ టేబిలు మీద తగలెట్టింది."

"ఎంత పని జరిగింది!"

"ఆనాడు ఆదివారం— సోమరాజులు మాస్టారు నన్ను చూడడానికి వచ్చినప్పుడు, మరో పేటలో మంచిల్లు కాస్త పెద్దది చూసి పెట్టమని చెప్పేను. అతడు నాలుగు రోజుల తరువాత వచ్చి, తను ఉంటున్న పేటలో ఓ ఇల్లు కాళీ ఉందని చెప్పేడు. నాకింకా నీరసంగా ఉండడం చేత మీ

## భూగర్భ నీటి పారుదల వ్యవస్థలు

సోవియట్ యూనియన్‌లో భూగర్భ నీటి పారుదల వ్యవస్థల నిర్మాణం ప్రారంభమైంది. కొద్ది లోతులో గొట్టపు మార్గాలను నిర్మించడం ద్వారా జలాలను మొక్కల వేళ్ళకే సరాసరి అందించడం జరుగుతూ వుంది. ఈ పద్ధతి వల్ల నీటి వినిమయం అనేకరెట్లు తగ్గి, పంట గణనీయంగా పెరుగుతూ వుందని ప్రయోగాలవల్ల రుజువైంది. జల వనరులు పరిమితమైన మధ్యాసియాలో భూగర్భ నీటి పారుదల అత్యంత ఉపయుక్తమైనదని తేలింది. దీనివల్ల అదనపు నీటి సరఫరా అవసరం లేకుండా ప్రత్తి, గోధుమ క్షేత్రాలను విస్తరించడానికి వీలు కలుగుతూ వుంది.






బులుసు వేంకట రమణయ్య

## పడుకొనే పద్ధతి

వినాయకుడి కథ అందరికీ తెలిసే ఉంటుంది పార్వతీదేవి తలంటి పోసుకునేటప్పుడు వినోదంగా పసుపు ముద్దతో వినాయకుణ్ణి చేసి, ద్వారం దగ్గర కాపు ఉంచగా, అతను శివుణ్ణి అడ్డుకున్నాడనీ, శివుడు కోపించి అతని తల త్రెగవేసినాడనీ, తర్వాత పార్వతీదేవి దుఃఖం పోగొట్టడానికి ఉత్తరదిక్కు వైపు తల పెట్టి పడుకొన్న ఏనుగు తల నరికి తెచ్చి అతికించి గజాననుణ్ణి బతికించాడనీ ఆ కథ. ఉత్తర దిక్కుగా తల పెట్టుకొని పడుకొన్న ఏ ప్రాణి అయినా చచ్చిన దానితో సమాన మని ఈ కథ వల్ల తెలుస్తున్నది.

ఉత్తర దిక్కుగానే కాదు, పడమటి దిక్కుగా కూడా తల పెట్టుకొని నిద్రించ కూడదు. ఈ విషయం ఈ శ్లోకం వల్ల తెలుస్తున్నది.

శ్లో॥ "నోత్తరస్యాం ప్రతీచ్యాంవా
కుర్వీత శయనే శిరః,
శయ్యా విపర్యయాద్ గర్భో
దితేః శక్రేణ పాతితః."

నిద్రించేటప్పుడు ఉత్తర దిక్కుగా గాని, పడమటి దిక్కుగా గాని తల పెట్టుకొని పరుండి నిద్రపోకూడదు. అలా పడుకొని ఉన్నందు వల్లనే ఇంద్రుడు తన సవతి తల్లి అయిన దితీదేవి గర్భంలో ప్రవేశించి, తనకు మృత్యువుగా జన్మించబోయిన ఆమె గర్భాన్ని ఛేదించడం సాధ్యమయింది. అనాచారమైన పద్ధతిలో ఉన్నప్పుడే ఇట్టివారికి అపకారం చెయ్యడం సాధ్యమవుతుందని ఈ శ్లోకం వల్ల మనకు తెలుస్తూ ఉన్నది.

ఇది పెద్దలు నిర్ణయించిన ఆచారం మాత్రమేనా? లేక కారణం కూడా ఏమైనా ఉన్నదా? అని ప్రశ్న కలగవచ్చును.

దీనికి కారణం లేకపోలేదు.

ఉత్తర, పశ్చిమ దిక్కుల నుంచి వీచే వాయువు తరంగాలు నిద్రించే వ్యక్తి శిరస్సు బ్రహ్మరంధ్రంలో ప్రవేశించి ఆ వ్యక్తి శారీరక, మానసిక సూక్ష్మ – పరమాణువులనూ, బుద్ధికి సంబంధించిన సూక్ష్మ పరమాణువులనూ కలుషితం చేస్తాయి. అందువల్ల ఆలోచనా శక్తీ, మంచి చెడ్డల వివేకమూ బలహీనాలయి పోతాయి. అందువల ధైర్య సాహసాలూ, ఆరోగ్యమూ చెడిపోతాయి. బుద్ధి సన్నగిల్లి పోతుంది. ఇవేవీ మనం కోరదగినవి కావుగదా! ఇంత దూరం ఆలోచించే మనవారు ఇట్టి నియమాలు చేశారని గ్రహించాలి.

---

పదిసార్లు చూసి రమ్మన్నాను. మధ్యాహ్నం చూసొచ్చి ఈ ఇంటి కన్నా బాగా నయమని, ఇంటద్దె పలభై రూపాయలే అని చెప్పింది. నాలుగైదు రోజులలో మంచిరోజు చూసుకుని వచ్చి దిగుతామని కబురు పెట్టేను. రెండు రోజుల తరువాత లక్ష్మి నేటనికి సినిమాకి వెళ్తానంది తన స్నేహితురాలు కమలతో. పోనీ పిల్ల ఈ మూడు వారాలు నా జ్వరం వల్ల ఇంట్లో చాల చాకిరి చేసింది. కాస్త విశ్రాంతిగ ఉంటుందని వెళ్ళమన్నాను. మణి వస్తా నంటే రావద్దని కసిరింది. ఆ నాడు ఆ ప్రేమలేఖ మణి వాళ్ళమ్మకు ఇచ్చినప్పటి నుండి మణం టే దానికి కోపంగా ఉండేది. వాళ్ళిద్దరికి పొత్తు విడిపోయిందనే అనుకున్నాం గాని దాని పద్దెనిమిదేళ్ళ బుర్రలో ఇంత పాడు ఆలోచనుందని అనుకోలేక పోయేము.

"ఆయాసం వస్తుంది. మీరూరుకోండి నే చెప్తాను" అంది రామలక్ష్మమ్మ.

"ఆ పాడుముండ మేటనీకి వెళ్ళిందనే అనుకున్నాం. సాయంత్రం ఏడైనా రాలేదు. దాని స్నేహితురాలు ఆ కమలింటికి ప్రభాకరాన్ని పంపేం. ఆ కమల ఇంట్లోనే ఉంది. అది సినిమాకు వెళ్ళలేదుట. అలా లక్ష్మితో వెళ్ళడానికి ఆలోచన చెయ్యలేదట. ఆ కమలకు ఈ గ్రంధం తెల్సినానుకుంటాను – లేక పోతే గ్రహించిందో. 'ఆ రామునాయుడితో లక్ష్మి వెళ్ళిందేమో కనుక్కోండి' అనిపలికించింది 'నీకెలా తెల్సునే?' అంటే లక్ష్మి పదిహేను రోజుల క్రిందట తనతో చెప్పిందట– ఆ రామునాయుడు, తను ప్రేమలేఖలు వ్రాసుకుంటున్నట్టు. ఎప్పటికైనా పెండ్లి చేసుకోదల్చుకున్నట్టు. ఆ మాటల్ని నమ్మలేక తెల్సిన నాలుగిళ్ళకు ప్రభాకరాన్ని పంపి కనుక్కున్నాం. అక్కడకు లక్ష్మి రాలేదని చెప్పేరు. దానితో మాకు మతి పోయింది, ఇది ఏ అఘాయిత్యమైనా చేసిందేమోనని. ఇంతలో మణి టేబిలు పై ఉన్న ఈ ఉత్తరం చూపింది."

"ప్రభాకరం! చిన్నాన్నకు ఆ ఉత్తరం ఇయ్యరా" బలరాం చెప్పేరు. టేబిలు డ్రాయరులోనున్న ఆ ఉత్తరాన్ని తీసి అందించేడు ప్రభాకరం. గోపాలం ఆ ఉత్తరం తీసి చదివేడు.

"నాన్నగారూ,

నమస్కారములు– నన్ను క్షమించండి. నేను మీకు కష్టం కల్గిస్తున్నాను. నేను, రామునాయుడు మనసారా ప్రేమించుకున్నాం. ఇప్పుడు పవిత్రంగా దేవుడి సన్నిధిలో పెండ్లి చేసుకోబోతున్నాం. ఈ రోజుల్లో వర్ణాంతర వివాహాలు చేసుకోమని పెద్ద మనుష్యులంతా తెగ ప్రచారం చేస్తున్నారు అందుకే మా వివాహం ఆదర్శప్రాయమైంది మమ్మల్ని ఆశీర్వదించండి మేము ఒక చోట స్థిర పడేక మీకు నా అడ్రసు తెలియజేస్తాను. మీరు, అమ్మ నా గురించి బెంగ పెట్టుకోకండి.

మీ కుమార్తె, లక్ష్మి"

/ఇంకా వుంది/

# డైరీలో ఒక కొత్త పేజీ

పాండ్రంకి సుబ్రమణి



విశ్వం ఆ సెక్షన్‌కి ట్రాన్స్‌ఫరయి వారం రోజులవుతుంది. అతడికీ ఆ సెక్షన్‌లోని కర్కులకీ మధ్య అనుబంధం అనేది ఏర్పడటానికి వారం రోజుల కాలం చాలదనే అనాలి. అనుబంధం మాట అటుంచి మనుష్యుల్ని అర్థం చేసుకోవడమే కష్టం. అయినా ఈ వారం రోజుల్లోపల అతడు ఆ చిరు సమాజంలో తారసిల్లిన మనుషుల్ని, మనసుల్ని, ఆలోచనా చారల్ని అర్థం చేసుకునేందుకు ప్రయత్నం చేశాడు. అలా ప్రయత్నించి అక్కడి వాళ్ల అంతరంగపు పొరల్ని కాస్తంత చూడగలిగాడు.

ఆ సెక్షన్‌లోని క్లర్కులు ఎప్పుడూ నవ్వుతూ కనిపిస్తారు. ఎదుటివారూ అలా నవ్వుతూ తుళ్లుతూ ఉండటంలో అతడికేమాత్రం ఆక్షేపణ లేదు. ఆ మాటకొస్తే తోటివారి నవ్వులు, గలగలలు, తవకాలు తన పనికీ అంతరాయం కలిగించలేవనే అతడి నమ్మకం. కాని వాళ్లలో ఎక్కువమంది నోటితో నవ్వుతూనే నొసటితో వెక్కిరిస్తారని తెలుసుకొని విశ్వం ఖిన్నుడయ్యాడు. వాళ్ల మాటల్లో కానవచ్చే మంచితనపు మాటున, పన్నీరు చిలికించే చిరునవ్వు చివరన, వన్నాటి చారలు దాక్కొని ఉండటం గమనించి విశ్వం దూరంగా జరిగాడు. అతడు వాళ్ల నుండి దూరంగా జరుగుతున్నాడని వాళ్లకు తెలియనీయకుండానే అతడు దూరంగా జరిగాడు.

* * *

“నైట్ క్వీన్ వస్తోందిరా! దారి తప్పుకోండి.” చంద్రం మెల్లగా అని, కినుక్కునే ఓసారి నవ్వి, నడిచి వస్తున్న పార్వతి వేపు చూశాడు. అతడి కామెంటు ఆమెకు వినిపించిందేమోనని విశ్వం ఆతృతగా ఆమె ముఖంలోకి చూశాడు. ఆమెకు అదేమీ వినిపించనట్టుంది. తిన్నగా వచ్చి తన సీట్లో కూర్చుని, చేతి రుమాలుతో నుదుటనున్న స్వేద బిందువులను తుడుచుకొని, బల్లపైనున్న ఫైల్ని దగ్గరకు లాక్కుంది.

“మేడమ్! అలసిపోయినట్టు కనిపిస్తున్నారు. బస్సు టైముకి దొరకలేదా?” సౌమ్యం ఉట్టిపడే కంఠస్వరంతో అడిగాడు చలం. “గుంట నక్క వినయం చూపిస్తోంది.” విశ్వం మనసు వెక్కిరింపుగా పలికింది.

“లేదండి. ఇంట్లో కొంచెం పనుండి ఆలస్యమయింది లేట్ రిజిష్టరులో సంతకం చేశాను.” ఆమె క్లుప్తంగా బదులిచ్చి సంభాషణకు ఫుల్‌స్టాప్ పెడుతున్నట్టుగా పెన్ తీసి వ్రాసుకోనారంభించింది. చలం అదేమీ గమనించనట్లు సంభాషణకు పదును పెట్టసాగాడు.

“ఛీ, ఏం ఆఫీసర్లురా వీళ్లు! ఓ పదినిమిషాలు లేటయితే చాలు కొంపలు మునిగినట్టు, గవర్నమెంటు ఖజానా ఖాళీ అయినట్టు అటెండెన్సు రిజిష్టరు లాక్కుపోతారు. ఇంతటి చిన్న చిన్న విషయాలలో ఆఫీసర్లు సరుకోకపోతే స్టాఫ్‌కి పని చేసే మూడ్ ఎలాగొస్తుందో చెప్పండి?” ఆమె తలెత్తి చూడలేదు.

ఆమె వింటూనే ఉంది.

పని చేస్తూనే ఉంది.

ఆమె వాళ్ల మాటల్లో మాట కలిపి వాళ్లకు ఉషారు గొలిపేలా బదులివ్వలేదని వాళ్లకు అక్కసు కలిగినట్టుంది. చేతిలోనున్న ఆయుధాన్ని విసరవలసిన సమయం చూసి విసరవలసిన విధంగా చంద్రం ప్రక్కనుంచి విసిరాడు.

“ఒరేయ్ చలం, అకౌంట్సు ఆఫీసరు ఈ రోజు లేటుగా వస్తార్ట్రా! సరైన సమయానికి ఆఫీసర్లు సీట్లో ఉండరు.” చంద్రం నొచ్చుకున్న వాడిలా ముఖం పెట్టి చిరాకుగా పేడ్‌ను తన బల్లపైన శబ్దం వచ్చేటట్టు పెట్టాడు.

ఈసారి ఆమె పెన్ నిలిచిపోయింది.

పని యాంత్రికంగా ఆగిపోయింది.

ఒక్క మాటతో ఒక కొండను నిశ్శబ్దంగా కదలించగలగడం విశ్వం ఆ రోజు కళ్ళారా చూశాడు. చలం విజయవంతంగా తన పనిని ముగించుకొని, తృప్తిగా చిరునవ్వు చిందిస్తూ అక్కణ్ణించి కదలి తన సీట్లో కూర్చున్నాడు. ఆ సెక్షన్ హెడ్ క్లర్కు అటువంటి మాటల్నీ, చేష్టల్నీ ఇసుమంత కూడా లక్ష్యం చేయకుండా, ఫైళ్ళలో తలకాయను ఉంచేసి పని చేసుకుంటున్నాడు. అతడు రిటైర్ అవడానికి మరో రెండేళ్ళు ఉన్నాయని విశ్వం విన్నాడు. అందువల్ల అతను తన గొడవలు తను చూసుకుపోతుంటాడు. పార్వతి ఎంత నిగ్రహించుకోవాలన్నా నిగ్రహించుకోలేక పోతున్నదని ఆమె ముఖం చూసి గ్రహించాడు విశ్వం. ఆమె అలా కొన్ని నిముషాల పాటు పని చేయలేక పోవడం గమనించి, విశ్వం మనసులో ఫీల్ అయ్యాడు. ఒకమనిషి దెబ్బతినడం— మరో మనిషికి సరదా కలిగించడం. ఇదీ మానవ నైజం! వాళ్ళు ఈ సారి మాత్రమే కాదు. ప్రతి సారి కూడా అలాగే చేస్తుంటారు. ఏదో మాట్లాడి, మరేదో ప్రస్తావించి, చిట్ట చివరన ఆ సెక్షన్ అకౌంట్సు ఆఫీసరు దగ్గరకు తీసుకువచ్చి ముడిపెడ్తారు. అకౌంట్సు ఆఫీసరుకీ భర్త పోయిన పార్వతికి మధ్య ఏదో ఉందని, మాటల ముల్లును రంగు రంగుల్లో ముంచి, సభ్యతను పుకార్లలో పొర్లించి ప్రచారం చేస్తుంటారు. ఎక్కడో ఒకచోట వాళ్ళు కలుసుకుంటున్నారని, టైమింగ్సు సృష్టించి చెప్పి, వినడానికి సుముఖత చూపించేవాళ్ళ దగ్గరా, చూపించలేనివాళ్ళ దగ్గరా శంఖం ఊదినట్లు చెప్పుతుంటారు. విశ్వానికి అటువంటి విషయాలలో ఆసక్తి లేకపోవడం మాత్రమే కాదు, ఆలా అనుమానపు పరదాలను, అపోహల తెరలను నలు దిక్కులా పరచేవారంటే అతనికి అసహ్యం. ఆమె కబురు అందిగాని, మరేదైనా పనిపైనగాని అకౌంట్సు ఆఫీసరు రూముకి వెళ్ళిందంటే చాలు— సెక్షన్ ఓ మినీ జనరల్ బాడీ మీటింగుగా మారుతుంది. రానురాను విశ్వం వాళ్ళ ప్రవర్తనను భరించలేకుండా ఉన్నాడు. అదే సమయాన వాళ్ళను ఎదిరించి ఏదైనా చెప్పడానికి సాహసించలేక పోతున్నాడు. వాళ్ళతోగాని, వాళ్ళు చెప్పే పోదితోగాని అంగీకరించని వాళ్ళను ఎదిరించడంలో వాళ్ళు అడవికుక్కల కున్నంతటి ఐక్యత ప్రదర్శిస్తారని అతడికి తెలుసు. అతడికి లోపల పార్వతి ప్రవర్తన పట్ల అనుమానం కలగకపోలేదు. ఒకవేళ ఆమెకీ, ఆఫీసరుకీ మధ్య 'అదేదో' ఉందని అనుకున్నా, పని చేసుకునేచోట వీళ్ళు అంతగా నెత్తీ నోరూ బాదుకునే అవసరం ఏమొచ్చిందన్నదే ప్రశ్న!

* * *

ఒకరోజు పార్వతి ఏకళనున్నదో— ఆమె హృదయంలో ఎటువంటి ఆనందం వెల్లివిరుస్తున్నదో తెలియదుగాని, ఎవరూ అనుకోని విధంగా లేచి వచ్చి "మా అమ్మ నిన్న మహాలక్ష్మి ఆలయానికి వెళ్ళి అర్చన చేసి వచ్చింది. విభూతి, కుంకుమ తీసుకోండి" అని మొదట పొట్లం చంద్రం ముందు ఉంచింది. విశ్వం వ్రాయడం ఆపి, ఆమెవేపు ఆశ్చర్యంగా చూశాడు. ఆ రోజు ఆమె అతడి కళ్ళకు విందుగా, అందంగా కనిపించింది. హిమబిందువులు పడి, భారంతో తలవంచిన పూలకొమ్మలా కనిపించిందామె. సంతోషంతో మెరుస్తున్న ఆమె ముఖం చూచి, చంద్రం అదోలా ముఖం పెట్టాడు.

"నాకు మీకున్నంత దైవభక్తి లేదండీ. విభూతి మాట అటుంచి— కుంకుమకూ నాకు రాశిలేదండి." అతడిచ్చిన బదులు బల్లెంలా పార్వతి గుండెకు తగలడం విశ్వానికి తెలుస్తూనే ఉంది. అది చాలదని చలం అటువేపు నుంచి వేడయిన, వాడయిన మరో బాణం విసిరాడు.

"ఒరేయ్ చంద్రం! ఈ రోజు మన అకౌంట్సు ఆఫీసరు నుదుట కుంకుమ బొట్టు పెట్టుకొని వచ్చాడురా! ఆ ముఖానికి దైవభక్తి ఒకటి?"

పార్వతి ముఖంలో రంగులు మారాయి. కళ్ళలోని కాంతులు నల్లటిరేఖల్లా మారాయి. వెనక్కి రాలేక ఆమె అచేతనంగా అక్కడే నిలబడి పోయింది. అప్పుడు కూడా హెడ్ క్లర్కు ఏమీ గమనించకుండా ఉండటం చూసి విశ్వానికి కోపం కలిగింది. అతడు సీట్లో నుండి లేచి, "పార్వతిగారూ! కుంకుమ మహాలక్ష్మి ఆలయం సన్నిధి నుండి కదండీ తెచ్చారు? మహాలక్ష్మి మా ఇంటి ఇలవేల్పండీ!" అని విభూతి కళ్ళకి పూసుకొని, ఆ తరువాత కుంకుమ పెట్టుకొని, "మీకు అభ్యంతరం లేకపోతే విభూతి, కుంకుమ మా ఇంటికి తీసుకువెళ్తాను" అని చిరునవ్వు నవ్వుతూ ఆమె చేతిలోంచి పొట్లం అందుకున్నాడు.

పార్వతి ముఖం ఆశ్చర్యంతో— ఆనందంతో విప్పారింది.

అక్కడి వాళ్ళ ముఖాలు నల్లటి గీతలతో ముడుచుకున్నాయి.

ఆరోజు ఉదయం నుండే చుట్టు ప్రక్కల్ని గమనించే స్థితిలో లేకుండా విశ్వం పని చేస్తున్నాడు. చీఫ్ అకౌంట్సు ఆఫీసరు చెప్పిన ఓ ముఖ్యమైన బిల్లును పూర్తి చేయడంలో నిమగ్నుడయ్యాడు. అప్పుడు పార్వతి చిన్నగా నవ్వుతూ అతణ్ణి సమీపించి "ప్రపంచాన్ని మరచి పోయి పని చేస్తున్నట్లున్నారు. కాఫీ తెచ్చుకున్నారా?" అని అడిగింది. అప్పుడతను తల పైకెత్తి చూశాడు. సెక్షను ఖాళీగా ఉంది.

"థాంక్సు. కాఫీ టైము జ్ఞప్తికి తెచ్చారు. మాయదారి బిల్లులో పడి అంతా మరచి పోయాను." అని అతడు పేడ్ను పక్కన పెట్టి లేచాడు.

"మీరు క్యాంటీనుకేగా వెళుతున్నారు?"

"అవును. బాగున్నా బాగాలేక పోయినా అక్కడికేగా వెళ్ళాలి. బయటకు వెళ్తే అరగంట సేపయినా పడుతుంది."

"నాదగ్గర ఒక కాఫీటోకన్ ఉంది." ఆమె దానిని అతడి బల్లపైన ఉంచింది. విశ్వం ఆమె వేపు నవ్వుతూ చూశాడు. తెల్లటి చీర కట్టుకుంది. కాటుక పెట్టుకొన్న కళ్ళు మెరుస్తున్నాయి. గుండ్రని ముఖంలో సౌమ్యత ఉట్టిపడుతూంది.

"మీ ఇంట్లో ఏదైనా విశేషమా?"

"అటువంటిదేమీ లేదండి. పక్క సెక్షన్లో ఒక ఫ్రెండు ఉన్నారు. క్యాంటీనులో ఎదురయి ఎంత చెప్పినా వినకుండా కాఫీ ఇప్పించారు. అంతకు ముందే తీసుకున్న కాఫీ టోకన్ నాతో ఉండిపోయింది."

"రేపు ఉపయోగించ వచ్చుగా!"

"అంతటి పొదుపుతనం వద్దులెండి. మీకు అభ్యంతరం లేదు కదా?"

"నో నో!" అని అతను టోకన్ తీసుకొని బయటకు నడిచాడు.

వారిరువురి మధ్యా పరిచయం పెంపొంది అప్పుడప్పుడు మాట్లాడుకోవటం ఆరంభిం

ఆ వారంరోజుల్లో చలం విశ్వం దగ్గరకు వచ్చి, "కంగ్రాట్స్, విశ్వం !" అని చేయి చాచాడు. విశ్వం మొదట తెల్లబోయి, ఆ తరవాత తేరుకుంటూ "ఎందుకూ ?" అని చేయి అందిచ్చాడు.

"అపారమైన మీ ధైర్యాన్ని చూసి — అచంచలమైన పట్టుదల చూసి."

"ధైర్యమా ! పట్టుదలా !"

"అవును. తెలుసుండి కూడా ఓ కొండను ఢీ కొనడానికి సిద్ధపడ్డారు, అందుకని."

"మీ మాటలు అర్థం కావడం లేదు."

"నిజంగా అర్థం కావటం లేదా ?"

"అవును."

"అకౌంట్సు ఆఫీసర్గారి ప్రియమైన వస్తువు పైన చేయి పెటడానికి సాహసిస్తున్నారే, అందుకని."

విశ్వానికి అర్థమయి, కోపం కట్టలు త్రెంచుకు వచ్చింది.

"వివరాలుముందూ చూసి మాట్లాడండి."

"చూడు విశ్వం భాయ్! మీ ఇష్ట ప్రకారం నేను మాట్లాడను. నోరు మూసుకుంటాను. కాని ఊరు ఊరుకుంటుందా చెప్పండి ? ముఖ్యంగా మన అకౌంట్సు ఆఫీసరుగారు ఊరుకోరని నా అనుమానం. ఎందుకయినా మంచిది. మీరు మాత్రం జాగ్రత్తగా ఉండండి."

ఈసారి విశ్వం సీట్లో నుండి లేచాడు.

"మర్యాదగా చెపుతున్నాను ఇక్కణ్నించి కదులుతావా, లేదా ?" విశ్వం కన్నెర్ర

# డైరీలో ఒక కొత్తపేజీ

జేయడం చూసి, చలం నిశ్శబ్దంగా వెళ్ళి తన సీట్లో కూర్చున్నాడు.

*  *  *

ఆ రోజు రిస్ట్రిక్టివ్ హాలిడే కావటాన సెక్షన్లో ఇద్దరు ముగ్గురు తప్ప ఎక్కువ మంది లేరు. ఆ వేళ హెడ్ క్లర్కు కూడా రాలేదు. మధ్యాహ్నం వరకూ మౌనంగా కూర్చుని పనిచేసిన విశ్వం, కాఫీ తాగి వచ్చి, పార్వతి పక్కనున్న ఖాళీ సీట్లో కూర్చున్నాడు. పార్వతి తలెత్తి చిన్నగా మృదువుగా నవ్వింది.

"మీతో కొంచెం మాట్లాడాలి."

"చెప్పండి." తిరిగి సర్దుకొని కూర్చుంది.

"వాళ్ళ ముందు మీరలా మౌనంగా ఉండడం బాగా లేదు."

"ఏం చేయమంటారు?" ఆమె కాసేపు ఊరుకున్న తరువాత అడిగింది.

"రియాక్టు చేయమంటాను. వారి వారి ఆత్మాభిమానాన్ని కాపాడుకోవడం వాళ్ళ వాళ విద్యుక్త ధర్మం. మీ మౌనం సభ్యతగానో, మంచితనంగానో పరిగణించబడడం లేదు. పిరికితనంగా భావిస్తున్నారు. మీరు ఎంత అణిగి ప్రవర్తిస్తారో అంతగా మిమ్మల్ని మెత్తాలని చూస్తారు ఈ మనుషులు."

"ఏం చేయమంటారో చెప్పండి."

"ఓ రోజు వెనకా ముందూ చూడకుండా ఒక్కడికిగాని ఓ లెంపకాయ వేసారంటే తతిమ్మావారు అణిగిమణిగి ఉంటారు." ఈ మాట విని పార్వతి గట్టిగా నవ్వింది. ఆ నవ్వులో ఆమె నిస్సహాయత స్పష్టంగా కనిపించింది.

"అంత సాహసం లేకపోతే గట్టిగా ఓ సారి అరవండి."

"నా కంతటి ధైర్యం లేదు విశ్వం గారూ! దయచేసి మీరు కూడా వాళ్ళ చేష్టల్ని చూసి ఫీల్ అవకండి. వాళ్ళు సంస్కార హీనులు. వాళ్ళతో పోట్లాడి చులకన అవడం నా కిష్టం లేదు." అతడిక మాట్లాడలేదు. మౌనంగా లేచి తన సీటు వేపు వెళ్ళిపోయాడు.

వారం రోజుల తరవాత పార్వతి క్యాష్ సెక్షన్కి ట్రాన్స్ఫర్ అయింది. ఆమె ట్రాన్స్ఫర్ అక్కడి వాళ్ళకు అమితమైన ఆశ్చర్యాన్ని కలిగించింది. ఎందుకంటే పార్వతి చాలా రోజుల్నుంచి ట్రాన్స్ఫరే అడుగుతూంది. అయితే లాభంలేకపోయింది. ఆమె నమ్మకం విడిచిన తరువాత, అనుకోని విధంగా ఆమె ట్రాన్స్ఫర్ అవడం చాలా మందికి నోటమాట లేకుండా చేసింది.

ఆమె కొత్తగా వచ్చిన క్లర్కుకి సీటు అప్పజెప్పి, విశ్వం దగ్గరకు వచ్చి, "అప్పుడప్పుడు సెక్షన్ వేపు వస్తూ ఉండండి" అంది. అతడు బదులివ్వలేదు. నవ్వుతూ తలూపాడు. ఆమె వెళ్ళిపోయింది.

*  *  *

ఒకరోజు విశ్వం, గడువు దాటిపోవడం వల్ల పుస్తకాన్ని లైబ్రరీకి ఇచ్చి రావడానికి హైరోడ్డమ్మట సైకిల్ తొక్కుతూ వెళుతున్నాడు. అతడెప్పుడూ సైకిల్ని నిదానంగా, నెమ్మదిగా తోలుతాడు. అతడలా సైకిల్ తొక్కుతూ వెళ్ళేటప్పుడు "విశ్వం గారూ!" అన్న పిలుపు వినిపించి బ్రేక్ వేసాడు. పార్వతి ఓ నాలుగేళ్ళ కుర్రాణ్ణి రోడ్డు ఓరమ్మట నడిపిస్తూ కనిపించింది. అతడు సైకిల్ని పక్కన నిలిపి "ఎవ్వడాఈ బాలుడు?" అని నవ్వుతూ అడిగాడు.

"నా కుమారుడు. విశ్వంగారికి నమస్కారం పెట్టరా కృష్ణా?" తల్లి ఆదేశానుసారం కుర్రాడు చేతిలోని రబ్బరు బంతిని తల్లికి అందిచ్చి, రెండు చేతుల్నీ జోడించాడు. "వెరీగుడ్ !" అని వాడి బుగ్గ గిల్లి

(44 వ పేజీ చూడండి)









# ఔత్సాహిక పాదాలకు సర్వకాలరక్ష

| | | |
|---|---|---|
| జయింట్స్ | 11 & 12 | రూ. 13.75 |
| మగవారివి | 7 – 10 | రూ. 12.25 |
| ఆడవారివి | 2 – 6 | రూ. 11.25 |
| పిల్లలవి | 9 – 1 | రూ. 9.25 |
| శిశువులవి | 6 – 8 | రూ. 7.50 |

స్థానిక పన్నులు అదనము

# TROT®
# కుషన్

కలకాలమూ ఉండే పాదసౌకర్యము

ట్రాట్ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు స్వంతదారులు:
ట్రాట్ షూ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్
19/4A ముస్సీగంజ్ రోడ్
కిద్దర్‌పూర్, కలకత్తా 700 023

సుప్రసిద్ధ "హవాయి" స్లిప్పర్స్
తయారీలో ఇండియా నిపుణులు
DRP
డైనమిక్ రబ్బర్ & ప్లాస్టిక్ ప్రైవేట్ లిమిటెడ్
వైట్‌ఫీల్డ్ రోడ్, మహదేవపుర పోస్ట్
బెంగుళూరు 560 048

Grant. DRP. 8 Tel

# వెన్నెల రాత్రి అమావాస్యం

జొంగుంట రామచంద్రమూర్తి

(గత పంచిక తరువాయి)

చలపతి చెప్పటం ప్రారంభించాడు....

"సుమతీ వాళ్ళూ మా యింటి ప్రక్కనే అద్దెకుండేవాళ్ళు. ఇద్దరం 'బిపిసీ' వరకూ కలిసే చదువుకున్నాం. వయసుతో బాటే మా స్నేహం కూడా పెరిగి ప్రేమగా మారింది. బిపిసీ కాగానే నేను ఓ స్పెంటిఫిక్ కంపెనీలో అసిస్టెంటుగా చేరాను. సుమతి మెడిసిన్‌లో చేరింది.

అయినా మేం ఇద్దరం చాలా తరచుగా షికార్లకూ, సినిమాలకూ వెడుతూనే వుండేవాళ్ళం.

మేం ఎక్కడకు వెళ్ళినా మా పెద్దవాళ్ళు ఎలాంటి అభ్యంతరమూ చెప్పేవారుకాదు. అసలు మా ఇద్దరికీ పెళ్ళి చెయ్యాలని వాళ్ళు అనుకున్నారని కూడా తెలిసింది. అందువల్ల అనుకోకుండానే సుమతిమీద నాకేదో హక్కున్నట్టుగా ఫీలయ్యేవాడ్ని. దానికి మీరు జెలసీ అని పేరు పెట్టినా నేనేం అనుకోను.

కానీ నేను ఆమెకు మరీ దగ్గరకు వెళ్ళాలని ఎంతగా ప్రయత్నించేవాడినో, ఆమెనాకు అంతదూరంగా వెళ్ళిపోతున్నట్లు అనుమానం కలిగింది. అనుమానం ఎప్పుడయితే కలిగిందో, ఆరాతీయటం ప్రారంభించాను.

నా అనుమానం అనుమానమే అయి వుంటే ఈపాటికి నేను సుమతిని పెళ్ళిచేసుకుని, ఇద్దరు పిల్లలతో హాయిగా వుండేవాడ్ని."

క్షణంసేపు చెప్పటం ఆపి కళ్ళు మూసుకున్నాడు చలపతి. ఇక అతను చెప్పబోయేదేమిటో భానుమూర్తికి అర్థమయిపోయింది. కానీ వినాలనే కుతూహలంతో—

"అయితే సుమతి మిమ్మల్ని మోసం చేసిందన్నమాట!" — అని అడిగాడు.

"అవును! తన క్లాస్‌మేట్ మరొకడితో సుమతి విచ్చలవిడిగా తిరుగుతున్నట్లు తెలిసింది, ఒకరోజు నిలవేసి ప్రశ్నించాను.

ఔనని సమాధానం చెప్పింది.

తనను ప్రేమిస్తున్నవాడు అన్నివిధాలా యోగ్యుడని సర్టిఫికెట్ ఇచ్చింది.

**జరిగిన కథ – 4 :** చిన్నతనంలోనే తన తల్లిదండ్రులను కోల్పోయి, ఉన్న వూరు వదలి హైదరాబాద్‌లో తన అక్క దగ్గరుంటున్న భానుమూర్తి, ఇల్లు అమ్మకం విషయంమీద తిరిగి ఆ వూరు వస్తాడు. అక్కడి ప్రదేశాలను చూస్తుంటే అతనికి గతస్మృతులు జ్ఞప్తికి వస్తుంటాయి. భానుమూర్తిని కరిణంగారి అమ్మాయి సుధ పెళ్ళి చేసుకోమని అడుగగా, తనకా అర్హత కలిగినప్పుడు తప్పకుండా చేసుకొంటానని సమాధానమిస్తాడు. భానుమూర్తి తల్లిదండ్రులు పోయిన తరువాత అతని బాధ్యతను, అక్క జానకికి ఇష్టంలేక పోయినా బావ రాజారాం స్వీకరిస్తాడు. ఓ హత్యకేసులో ఇరుక్కుని జైలుకెళ్ళిన భానుమూర్తికి, అక్కడ చలపతితో పరిచయము అవుతుంది. అతను ఏ కారణాన జైల్లోపడ్డాడో భానుమూర్తికి చెప్తుంటాడు.

పైగా తనకోసం పడి ఛస్తాడనీ కూడా గర్వంగా చెప్పింది.

...అయితే అంతకంటే యోగ్యుడూ, అంతకుమించి పడి చచ్చేవాడూ కనిపిస్తే, వాడికోసం మళ్ళీ వీడ్నికూడా వదిలేస్తావా? అని అడిగాను. అలాంటి సందర్భం వచ్చినప్పుడు ఆ ప్రశ్నకు సమాధానం చెప్తానంది.

మొదటిసారిగా సుమతి అంటే అసహ్యం వేసింది. జీవితంలో మోసపోయాననిపించింది. అందుకే ఆమెకు అసలు జీవితమే లేకుండా చేయాలని నిర్ణయించుకున్నాను. కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాలనే నెపంతో ఒకరోజు ఆమెను బోటు షికారుకు తీసుకెళ్ళాను. నాతోవున్న చనువువల్ల ఎలాంటి అభ్యంతరమూ చెప్పకుండానే వచ్చింది. ఎంతోసేపు బోటులో షికారు తిరిగాం.

చీకటిపడింది. అంతే! ఆ చీకటిలోనే నేను కళ్ళు మూసుకుని, ఆమెను బలంగా నీళ్ళల్లోకి తోసేశాను. నిస్సహాయంగా సుమతి ఆర్తనాదం చేసింది. దూరంగా మరో బోటులో వున్నవాళ్ళూ, మా బోటు నడుపుతున్న మనిషీ కలిసి ఆమెను ఎలాగో పైకితీశారు.

కొనవూపిరితో వున్న సుమతి జరిగిందంతా, చెప్పివైద్య సహాయాన్ని పొందకుండానే చచ్చిపోయింది. తప్పు చేశాననే భయంగానీ, భీతిగానీ నాకు కలగలేదు. ఆమెవల్ల మోసపోయే మరి కొంతమంది యువకుల్ని కాపాడగలిగానని మనసుకు నచ్చచెప్పుకున్నాను. నిర్భయంగా వెళ్ళి జరిగిందంతా పోలీసు స్టేషన్లో చెప్పాను.

శిక్ష పడింది. పడుతుందని నాకూ తెలుసు. కానీ ఒక్కరైనా, నేను సుమతిని ఎంత గాఢంగా ప్రేమించానో అర్థం చేసుకోలేదు. కొందరు 'నాకు అమాయ' అన్నారు. మరికొందరు నాది మూర్ఖత్వమన్నారు".

చెప్పటం ముగించి కళ్ళు మూసుకున్నాడు చలపతి

నిజమే! మూర్ఖత్వం కాక మరేమిటి? ముందుగా సుమతి చలపతిని ప్రేమించింది. తరువాత 'జవరాండ్ర చిత్తములు క్షణక్షణానికీ మారును' అని అన్నందువల్లనో మరేం కారణం చేతనో, మనసు మార్చుకుని మరో మనిషిమీద మరులు పెంచుకుంది.

అలాంటప్పుడు తన దురదృష్టానికి చింతించటం పోయి,ఎదుటివాడి అదృష్టం

మీదపడి అఘోరించటం ఎందుకూ? తను మోసపోయినట్టు ఇంకా ఎందరో మోస పోతారని ముందే వూహించి, ఓ నిండు ప్రాణాన్ని నీటిపాలు చేయటం ఎంత దారుణం? పైగా తాను రంగుటద్దాలు తగిలించుకుని, అందరికీ ఆ రంగులే కనిపిస్తున్నాయనుకోవటం మూర్ఖత్వం కాదూ?

భానుమూర్తి ఆలోచిస్తూ వుండి పోయాడు.

''ఏమిటీ, మీరలా మౌనంగా వుండి పోయారు? నా ట్రాజెడీ మీకు బోర్ కొట్టిందనుకుంటాను. ఇంక లేవండి సాపాటుకి టైం అయినట్టుంది'' అంటూ లేచాడు చలపతి.

''అన్నట్టు మీ కథ రేపు సాయంత్రం చెప్పాలండోయ్!'' అన్నాడు ముందుకు నడుస్తున్న భానుమూర్తిని ఉద్దేశించి.

అలా ప్రతిరోజూ చలపతీ, భానుమూర్తీ ఎప్పుడో ఒకసారి కలుసు కోవటం, వాళ్ళ గతం తాలూకు అనుభవాలు చెప్పుకోవటం జరుగుతూనేవుంది.

ఖైదీలందరితోబాటూ భానుమూర్తి కూడా ప్రతిరోజూ ఏదో ఒక పని చేస్తుండే వాడు. రాత్రి సమయాల్లో తన గదిలో వుండే తక్కిన ఖైదీలకు నిద్ర రాకపోతే తన వూళ్లో తాత పాడిన ఐత్వాలను పాడి వినిపించేవాడు. ఒకవేళ అందరూ నిద్ర పోయిన సమయాల్లో తనకు నిద్ర రాకపోతే, అమ్మను తలచుకుని లోలోపలే దుఃఖించే వాడు. అమ్మ బ్రతికేవుంటే తనకు ఈస్థితి వచ్చేది కాదని పదే పదే అనుకునే వాడు.

ఓ రోజున భానుమూర్తిని చూడటానికి హైదరాబాద్ నుంచి రాజారాం వచ్చాడు.

అప్పుడు మధ్యాహ్నం మూడు గంట లయింది.

వేసవికాలం కావటంవల్ల ఎండ ఇంకా తగ్గలేదు. చెమటపట్టిన ముఖాన్ని ఓ చేత్తో



తుడుచుకుంటూ, మరో చేత్తో చిన్న సంచీ పట్టుకుని వస్తున్న బావను, అంత దూరం నుంచే చూసిన భానుమూర్తి కొంచెం ఖంగారుపడ్డాడు.

"ఎప్పుడొచ్చావ్ బావా?" తెప్పరిల్లి అడిగాడు.

"పొద్దున్నే వచ్చాను. నిన్ను చూడటానికి పర్మిషన్ ఇప్పటికి దొరికింది" అంటూ సంచీనుంచి పొట్లం తీసి భానుమూర్తి చేతిలో పెట్టాడు.

"ఏమిటిది బావా?"

"ద్రాక్షపళ్ళు! మీ అక్క మరీ మరీ చెబితే, వచ్చేటప్పుడు నాంపల్లి స్టేషను దగ్గర కొన్నాను. తీరా తెస్తే ఇక్కడ వీళ్ళు, లోపలకు ఏవీ తీసుకెళ్ళి ఖైదీలకు ఇవ్వకూడదని నానా గొడవా చేశారు. దానికి కూడా ఎలాగో పర్మిషన్ సంపాదించాన్లే!" గర్వంగా అన్నాడు రాజారాం.

"అక్కయ్య కులాసాగా వుందా? అప్పుడే రెండు నెలలు దాటిపోయింది చూసి!"

"ఆఁ! కులాసాగానే వుంది. దానికీ నిన్ను చూడాలని వుంది. కానీ పిల్లల్ని ఒదిలిపెట్టి ఇంత దూరం రావాలంటే కష్టమే! పైగా బోలెడంత ఖర్చు"

"నువ్ మాత్రం ఇప్పుడు ఎందుకొచ్చావ్ బావా? ఇంకో నాలుగు నెలుపోతే నేనే వచ్చేస్తానుగా! అనవసరంగా అరవయ్యో, డబ్బయ్యో రైలు ఖర్చులకు పోసే బదులు, పిల్లలకు బట్టలు కుట్టిస్తే బాగుండేది" భానుమూర్తి మామూలు ధోరణిలోనే అన్నాడు.

కానీ రాజారాం మరోలా అర్థం చేసుకున్నాడు. తాను దుర్భర దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నట్లు భానుమూర్తి అనుకుంటున్నాడని భావించాడు.

"సంతోషించాంలే నీ తెలివి తేటలకి! నేనేమంత దరిద్రంతో కొట్టుకుపోతున్నాననుకోకు! అయినా నిన్నూ నా పిల్లల్లో ఒకడిగా పెంచాలని తీసుకొచ్చాను. వాళ్ళతో సమానంగా నీకూ అన్నీ చేశాను. ఇక్కడ నువ్విలా జైల్లో పడివుంటే అక్కడ నేనూ జానకీ, అన్నం నీళ్ళూ సహించక అఘోరిస్తున్నాం" ఉక్రోషంగా అన్నాడు రాజారాం.

ఆమాటలు భానుమూర్తిని అణువణువునీ ఆప్యాయతతో తడిపేశాయి.

"నీ మనసుకు కష్టం కలిగించాలని



నా ఉద్దేశ్యంకాదు బావా! ఎంతోదూరం నుంచి ప్రయాసపడి వచ్చావని బాధకలిగింది. అంతే!" చెమ్మగిల్లిన కళ్ళను మునివేళ్ళతో తుడుచుకుంటూ అన్నాడు భానుమూర్తి.

మరో గంటసేపు కూర్చున్న తరువాత రాజారాం వెళ్ళిపోయాడు.

"మీ వాళ్ళెవరో వచ్చినట్టున్నారే?" ఆ సాయంత్రం చలపతి అడిగాడు.

"హైదరాబాదు నుంచి మా బావ వచ్చాడు"

"నిన్ను పెంచారని చెప్పావ్ — ఆయనే కదూ?"

"అవును! ఆయన ఋణం నేను ఈజన్మకు తీర్చుకోగలనో లేదో?"

చలపతి నవ్వేసి— "ఆయనే తన ఋణం తీర్చుకుంటున్నాడని ఎందుకు అనుకోకూడదూ?" — అన్నాడు.

"కావచ్చు... అందుకే ఆయన ఔదార్యాన్ని ఇన్నాళ్ళూ తేలిగ్గా అంచనా వేసుకున్నానేమో?" — మనసులో అనుకున్నాడు భానుమూర్తి.

ఆ రాత్రి భానుమూర్తి అన్నం తినలేదు. బావ తెచ్చిన ద్రాక్షపళ్ళు తిని, మంచినీళ్ళ

## విజేత

నువ్వెంతగా
నిప్పులు చెరిగితేమటుకు
మధుమాసం మాడిపోతుందా?
నువ్వు చెరిగిన
నిప్పుల్లోంచి
జీవశక్తిని పిండుకుని,
తెలిమల్లె
తోట తోటనా విరబూస్తుంది!

నువ్వెంతగా
విషగాలుల్ని వుసికొలిపితేమటుకు
ఆ మల్లె తలొగ్గుతుందా?
నువ్వు వుసికొలిపిన గాలుల్ని
తనకు అనుకూలంగా మలచుకుని,
పరిమళమై
పల్లె పల్లెన విహరిస్తుంది;
విజేతగా ప్రకటించుకుంటుంది —

— ఖమ్రొద్దీన్

తాగాడు. తన మనసంతా తేలికయినట్లు యుంది. కోర్టులో తనకు శిక్ష పడినప్పుడు— పోలీసు వ్యానులో తానుఎక్కి కనుమరుగవుతూంటే — తననుచూసి అక్కయ్య కన్నీరు పెట్టుకున్న దృశ్యమే ఇన్నాళ్ళూ— తరచుగా కనిపిస్తూండేది. ఇకనుంచీ — అన్నం హితవు కాక, కంచంముందు దిగులుగా కూర్చునే అక్కయ్య రూపం కనిపిస్తుంది తనకు!!

తాను అక్కయ్యకు భయపడుతున్నాడు. కానీ అక్కయ్య మనసులో కూడా మమతలు వున్నాయి. రక్తసంబంధంలోని ఆంతర్యం అదేకావచ్చు...అదీకాక, కన్న మనసుకంటే పెంచిన మనసు గొప్పదంటారు... తాను ఎలా పెరిగినా ఇంతకాలమూ అక్క నీడలో పెరిగాడు.

ఆ ఆలోచన వచ్చిన భానుమూర్తి — ఇక ముందు తాను అక్కయ్య కొడుకుగా మారిపోవాలని నిర్ణయించుకున్నాడు.

అప్పటినుంచీ భానుమూర్తికి రోజులు మరింత త్వరగా గడిచిపోతున్నాయి. ప్రతి రోజూ చలపతిని కలుసుకున్నప్పుడు తానింక ఎన్నిరోజుల్లో విడుదల కాబోయేదీ లెఖ్ఖకట్టి చెప్పేవాడు. విడుదలయిన తరువాత హైదరాబాదు తిరిగి వెళ్ళి, తాను కొత్త జీవితాన్ని ఎలాగడిపేదీ ఊహించి చెప్పేవాడు.

ఓ సారి వరసగా నాలుగు రోజులు తనే చలపతి గదికి వెళ్ళాడు. చలపతి చాలా నీరసంగా కనిపించాడు.

"ఏం అలావున్నారు?" — అడిగాడు.

"ఒంట్లో కొంచెం సుస్తీ!...అంతే!... నిన్నా మొన్నా డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళారు. కొన్నాళ్ళపాటు ఏ పనీ చేయకుండా రెస్ట్ తీసుకోమన్నారు. ఇవిగో మందులు కూడా ఇచ్చారు..." —పక్కనే వున్న రెండు మందు సీసాలూ, కొన్ని ట్యాబ్లెట్లూ చూపించాడు చలపతి.

వాటిని చూస్తూవుండి పోయాడు భానుమూర్తి.

"ఇంక ఇరవై రోజుల్లో మిమ్మల్ని విడుదల చేసేస్తారు కదూ?"

"అరె! నా విడుదల తేదీని మీరుకూడా బాగా గుర్తు పెట్టుకున్నారే?" — ఆశ్చర్యాన్ని కనబరుస్తూ అడిగాడు భానుమూర్తి.

"భలేవారే!... మీతో పరిచయం కలిగినప్పటినుంచీ, నాకు తెలియకుండానే



మీరు అందమయిన
దుస్తులు ధరిస్తే చాలా?
మీ ముఖ సౌందర్యాన్నీ
పెంపొందించుకోవాలి!
FACE POWDER
Pond's
FACE POWDER
మీ ముఖం అందంగా
వుండడానికి... పాండ్స్ ఫేస్ పౌడర్
మృదుత్వమే కారణం.
అది మీ ముఖానికి మృదుత్వంతో
అనమానమయిన కళని తీసుకు
వస్తుంది. ఆ కళ అలాగే
వుంటుంది. గంటల తరబడి...
గంటల తరబడి...
పాండ్స్ ఫేస్ పౌడర్
అనుపమ ముఖసౌంధర్యానికి అద్వితీయమయినది
Pond's
CP-1462

రోజులు గడిచిపోతున్నాయి'' — చలపతి కళ్ళల్లో ఆనందం, ఉత్సాహం కనిపించాయి

''నాకూ ఇలాగే అనిపిస్తోంది. వచ్చిన కొత్తల్లో, ఈ వాతావరణాన్నీ, ఇక్కడి మనుషుల్నీ చూసి చాలా భయపడ్డాను. కానీ మీ స్నేహం దొరికినప్పటినుంచీ ఇక్కడ కూడా మంచి మనుషులు వుంటారని సమాధానపడ్డాను. మిమ్మల్ని వదలి వెళ్ళిపోయే రోజు దగ్గరకు వస్తోందంటే నాకెందుకో దిగులుగా వుంది!''—

''నేనూ ఇంక ఎంతోకాలం ఇక్కడ వుండను భానుమూర్తిగారూ!''—

''అదేం?... జైలు మారుస్తారా?''—

''కాదు!... జన్మే మారిపోతుంది. బహుశా నేను అట్టేకాలం బతక్కపోవచ్చు!''—

ఉలిక్కిపడ్డాడు భానుమూర్తి.

''నిజమే భానుమూర్తిగారూ! నాకొచ్చిన జబ్బు లంగ్‌కాన్సర్! రెండేళ్ళ క్రితమే డాక్టర్లు చెప్పారు. మహా వుంటే మరో ఆరు నెలలు... కాకపోతే ఏడాది!... అంతే...! యావజ్జీవ శిక్ష నాకు విధించినట్టు కోర్టులో ఒకనాడు తీర్పు చెప్పినప్పుడు నేనెంత కలవరపడ్డానో — నాకు కాన్సర్ అని డాక్టర్ చెప్పినప్పుడు — అంతగానూ సంతోషించాను. ఇదికూడా నాకు భగవంతుడు విధించిన శిక్షే కావచ్చు'... కానీ మనుషులు విధించిన శిక్ష నుంచి విముక్తి పొందబోతున్న సంతృప్తి నాకు కలిగింది...'' —

వేదాంతిలా చలపతి అలా చెబుతూంటే కన్నార్పకుండా అతన్నే చూస్తూ కూర్చున్నాడు.

''జైల్లో కొంతకాలం అలా వుండేసరికి — చైతన్యం నశించిపోయి, ఆ మనిషికి ఓ రకమైన వైరాగ్యం కలుగుతుంది కాబోలు... స్మశాన వైరాగ్యం, ప్రసూతి వైరాగ్యం!... అలాగే ఇదీ ఓ రకమైన వైరాగ్యం... జైలు వైరాగ్యం!'' భానుమూర్తి అనుకున్నాడు.

''మీరు నాకో సహాయం చేయగలరా?''— కొన్ని క్షణాల తర్వాత చలపతి అడిగాడు.

''చెప్పండి!''

''మీరు హైదరాబాద్ వెళ్ళిన తరువాత ఓసారి మా యింటికి వెళ్ళాలి. మీకు చెప్పానుగా, బొలారంలో మా అమ్మా చెల్లాయీ వుంటున్నారని! .. వాళ్ళను ఒక్కసారి కలుసుకోండి... మీరు వాళ్ళను చూస్తే — నాకూ చూసినట్టే అనిపిస్తుంది!... నేను కులాసాగానే వున్నానని చెప్పండి''—

''అలాగే, తప్పకుండా వెడతాను... ఒక్కసారే కాదు... వీలున్నప్పుడల్లా వెడతాను... వాళ్ళ విషయంలో మీరు ఎలాంటి దిగులూ పెట్టుకోకండి!''

''దిగులుపడి మాత్రం నేనేం చేయగలను భానుమూర్తిగారూ! చేతికి అందిన కొడుకు బ్రతికుండే చచ్చిపోయాడని మా అమ్మే నా గురించి దిగులుపడాలి... ! అలనాపాలనా చూసి తనను ఓ అయ్య చేతిలో పెట్టటానికి అన్నయ్య లేకపోయాడే అని చెల్లాయి దిగులుపడాలి!... అంతేకానీ నాకెందుకండీ దిగులూ?''—చలపతి మాటలు గాద్గదికంగా వున్నాయి.

తోటివాళ్ళ సుఖంకోసం — కావాలంటే తాను కష్టపడే స్వభావం భానుమూర్తిది. ఎదుటివాళ్ళు కష్టపడుతున్నా — కంటతడి పెట్టుకున్నా తట్టుకోలేడు. అందుకే చలపతి పరిస్థితిని గమనించి చలించిపోయాడు...

## అంతరంగం అలలపై...

అంతరంగం అలలపై
కవితా చేలాంచలాన్ని
ఎగరవేస్తున్నా !
నీ జ్ఞాపకాల సురభిశాల్లోంచి వీచే
నూతన పవనాలకు నా అంతరంగం
ఉత్తేజితమై మెదడంతా
నూతన రశ్మి!
మనోగగనంపై కొత్త కవితల
మెరుపులు!

— శశికాంత్ శాతకర్ణి

## 9

ఆ రోజు ఆఫీసులో జరిగిన సంఘటన రాజారాం మనసును తీవ్రంగా గాయపరచింది. ఇన్నేళ్ళ సర్వీసులో — ఇంత వయసు వచ్చిన తరువాత — ఎవరూ తనను అంత మాట అనలేదు.

తనకు జలుబుచేసి జ్వరం వచ్చినట్లుంటే — రెండు రోజులు ఆఫీసుకు శలవు పెట్టాడు. దానికితోడు మూడో రోజున ఆఫీసుకు ఆలస్యంగా కూడా వచ్చాడు.

రాగానే సెక్రటరీ పిలిచాడు.

భయపడుతూనే వెళ్ళాడు రాజారాం...

''మీరు శలవు పెట్టే ముందు నాకు ముందుగా చెప్పి వుండవలసింది''— అన్నాడు సెక్రటరీ.

మామూలుగా రెండు మూడు రోజులు శలవు కావల్సి వచ్చినప్పుడు — ఇదివరకయితే, సెక్రటరీకి చెప్పవలసిన అవసరం వుండేది కాదు. కానీ ఇప్పుడు ఈ కొత్త సెక్రటరీ వచ్చిన తరువాత స్టాఫ్ అందరికీ ఇబ్బందిగానే వుంటోంది.

స్వతహాగా పనినుంచి తప్పించుకోవాలని చూసే మనిషికాదు రాజారాం... కానీ ఈమధ్య, తనకు తెలియకుండానే పనిలో కొంచెం అశ్రద్ధ చూపుతున్న మాట వాస్తవం... పైగా అప్పుడప్పుడు అనారోగ్యం కూడా చేస్తోంది.

ఆర్థికంగా ఎదురయ్యే ఇబ్బందులు కొన్నయితే, మానసికమైన చికాకులు మరికొన్నీ — అందుకు కారణం కావచ్చు... పిల్లల అవసరాలు రోజురోజుకీ పెరిగిపోతున్నాయి. పెద్దకొడుకు రామానికి పూనాలో ఉద్యోగం వస్తే — ఆ నెలలోనే రెండువందలు అప్పుచేసి అతగాడ్ని పూనా పంపించాడు.

ఇలాగే ఏవేవో చికాకులు — రాజారాంకి మనశ్శాంతి లేకుండా చేస్తున్నాయి.

రాజారాం అలా తలవంచుకుని—మౌనంగా ఆలోచిస్తూ వుండిపోవటం చూసి సెక్రటరీ మరికొంచెం రెచ్చిపోయాడు.

''ఇన్నేళ్ళ అనుభవం వుండికూడా మీరిలా ప్రవర్తించటం నాకు నచ్చలేదు .. మీ వయస్సుకి గౌరవం ఇచ్చి గట్టిగా ఏమీ అనలేకపోతున్నాను. మీ సెక్షన్‌లో ఎన్నిఫైళ్ళు మూలుగుతున్నాయో ఒక్కసారి చూడండి! రెండు రోజులు 'ఓవర్‌టైం' చేసయినా సరే — అవన్నీ క్లియర్ చెయ్యాలి! ''— హెచ్చరించాడు.

సీటులోకి వచ్చి కూర్చున్న రాజారాంకి కళ్ళ నీళ్ళ పర్యంతం అయింది. తనకంటే చిన్నవాడు — పెద్ద హోదాలోవుండి—తనను అన్ని మాటలు అనటం, భరించలేని అవమానంగా తోచింది. ఆ వెంటనే, తన

[ 42వ పేజీ చూడండి ]

"రాజాకు పాలు అంటే ఒకప్పుడు అయిష్టం... నేను న్యూట్రామూల్ కలిపి యిచ్చినప్పట్నించీ మహా యిష్టం"





# "మరిప్పుడు వాడు న్యూట్రామూల్ మొనగాడు"

పిల్లలు పాలు తాగటానికి మారాం చేస్తున్నారా? లేదు, అంటున్నారు రుచికరమైన న్యూట్రామూల్ కి దీవనలిచ్చే అసంఖ్యాకమైన తల్లులు. రుచికి రుచీ, బలానికి బలం, న్యూట్రామూల్‌లో కోకో, పాలు మాల్ట్ లతో పుష్టి వుంది—




ఐతే రుచి. మరి దీన్లో ప్రోటీన్లు, విటమిన్లు, ఖనిజాలూ వున్నాయి. పెరుగుతూన్న దశలోని శరీరానికి పుష్టినిచ్చేవి యివి. సువాసనతో నిండిన న్యూట్రామూల్ ప్రతి కప్పూ ఎంతో పోషణని యిస్తుంది.

మార్కెట్ చేయువారు
గుజరాత్ కో-ఆపరేటివ్
మిల్క్ మార్కెటింగ్
ఫెడరేషన్ లిమిటెడ్
ఆనంద్, గుజరాత్

అమూల్
## న్యూట్రామూల్
ప్రతి కప్పు మీకు పోషణను ఇచ్చు!

daCunha GCM-16 T.L

## గోపాలరావుగారమ్మాయిలో అమ్మాయిల క్రేజ్ గోపాలరావు

(రావు)గోపాలరావు డ్రెస్సింగ్ టేబుల్ ముందు కూర్చొని, తెల్లజుట్టు కనబడకుండా నానాయాతనలు పడుతూండగా భార్య జానకి (జానకి) వచ్చి, ''మీరు ఎంత శ్రమపడ్డా, మిమ్మల్ని కుర్రవాడని ఎవరూ అనుకోరు,'' అంది.

''అక్కడే పొరబడుతున్నావ్. నాకు బయట సర్కిల్స్‌లో — ముఖ్యంగా ఆడవాళ్ళ సర్కిల్స్‌లో ఉన్న పాపులారిటీ నీకు తెలీదు. చెబుతాను ఈర్ష్య పడవు కదా? ఈ ఊళ్ళో చదువుకున్న ఆడపిల్లలకి — పెళ్ళికాని ఆడపిల్లలకి మనమంటే పెద్ద క్రేజ్. హీమాన్, చార్మింగ్ డార్లింగ్ — అని మనకి టైటిల్స్. అసలు మనం కనబడితే చాలు — పడిపోయేవాళ్ళెంత మంది! ... అసలు నేను కారు మీద వెళ్లేటప్పుడు ఏ ఆడపిల్లల కాలేజీ ముందు ఆగిపోతుందా భగవంతుడా — అని హడలి చస్తూంటాను. ఎందుకంటే, వాళ్ళంతా మూగిపోయి...ఏదో హడావుడి...గందరగోళం...''



'ప్రేమ తరంగాలు'లో ఒక దృశ్యం

''హ...హ. చాల్లెండి. ఇంత వయసు వచ్చాక కూడా మీరు ఇలాంటి కబుర్లు చెబుతుంటే, నన్ను నమ్మమంటారా?''

''నిజం చెప్పినా నమ్మకపోతే, నేనేం చెయ్య గలనోయ్! చూడు, జానకీ! నా వయసు ఇంత అని నీకు తెలుసు — పెళ్ళినాటి నుంచి నువ్వు లెక్క పెడుతున్నావ్ కనుక. అది ఇతరులకేం తెలుస్తుంది? అయినా, ఒక కిటుకు చెప్పమంటావా? వయసు ముదురుతున్నా కుర్రాళ్ళలా కనిపించే సినిమా హీరోల టైప్‌మనది. అవును జానకీ! ఒకవేళ ఆ హీరోననుకొని ఆడాళ్ళు సడన్‌గా దండెత్తినా దండెత్తవచ్చు. నువ్వేం కంగారుపడకు.''

''మీరేం కంగారు పడకండి. వచ్చిన వాళ్ళకు వాతలు పెట్టి పంపిస్తాను.''

''ఛ ఛ! అదేమిటి? నీకు బేడ్ నేమ్ వస్తుంది. పైగా, పాతకాలపు స్త్రీవనుకుంటారు.''

''అదే కొత్తకాలపు స్త్రీ అదే, ఏ సెల్ఫ్ గర్ల్ మీతో కాస్త నవ్వుతూ మాట్లాడి ఉంటుంది దాంతో ఒళ్ళు మర్చిపోయి, ఇంకొక కొత్త స్టీరియో కొనుక్కొచ్చి ఇంట్లో పారేసుంటారు. లేకపోతే ఏమిటండీ? ఒకటుండగా ఇంకొకటెందుకు?''

''అలా నెమ్మదిగా అడుగు చెబుతాను ఈ మధ్య ఒక కొత్త పాలసీ పెట్టుకున్నాను. ప్రతిసంవత్సరం పాతదవాన్ని తీసేసి, కొత్తదనతో నింపేయడం...నా కళ్ళముందూ, చుట్టూతా ఎటు చూసినా ఫ్రెష్‌నెస్...కొత్తదనం...''

''వీలుపడక ఊరుకున్నారు. లేకపోతే, పెళ్ళాన్ని కూడా మార్చేసుండేవారు... ఈ కబుర్లకేంగాని, ఆ దిక్కుమాలిన స్టీరియోసెట్ మీరు తీసుకొచ్చిన రెండోరోజుకే రిపేర్ కొచ్చింది.''

''వాట్!'' నిర్ఘాంతపోయాడు గోపాలరావు.

కె. వాసు దర్శకత్వంతో ఎ. సారథి నిర్మించే నాగార్జున పిక్చర్స్ ''గోపాలరావు గారమ్మాయి''లో అమ్మాయి జయసుధ. చంద్రమోహన్ నాయకుడు. నాగభూషణం, మోహన్ బాబు, సారథి, గెస్ట్‌గా కె. విజయ పాల్గొంటున్నారు. సత్యానంద్, చక్రవర్తి, తోట హేమచందర్, ఎన్. గోపాలరెడ్డి, నాయుని మహేశ్వరరావు, శరత్, అంజిరెడ్డి, చంద్రమోహన్, పుయ్యూరు రామకృష్ణ ప్రభృత సాంకేతికవర్గం.

## పిలిమ ప్రొడక్షన్స్

శోభన్‌బాబు, జయసుధ నాయకానాయికలుగా వి. మధుసూదనరావు దర్శకత్వంలో కొల్లి ఆంజనేయులు, కె రమేష్‌బాబు నిర్మించే చిత్రం షూటింగ్ ఆగస్ట్ 15న ప్రారంభమవుతుంది. ప్రభాకరరెడ్డి ఒక విశిష్టమైన పాత్రను నిర్వహిస్తారు. చక్రవర్తి, వెంకట్, కోటగిరి గోపాలరావు, కుదరవల్లి నాగేశ్వరరావు ప్రభృత సాంకేతిక వర్గంలో వి. బి. జి. తిలక్ సమర్పిస్తారు.

జి. వి. జి.

## మదన మంజరిలో మథన పడ్డ మంజరి

మదన్ ముందు నిలుచొని ఉన్న మంజరి పక్షవాతం వచ్చినదానిలా ఒక్కసారి కెవ్వున అరచి, కుప్పలా కూలిపోయింది.

"మంజరీ! ఏమైంది, మంజరీ?" ఆందోళన చెందాడు మదన్.

మంజరి బాధతో మెలికలు తిరుగుతూ, "ఏమోనండి. ఏదో అదృశ్య శక్తి నా నరనరాలను లాగేస్తోంది. నా ప్రాణాలను పిండేస్తోంది. నేను అవిటిదాన్నయి పోయానండీ – అవిటిదాన్నయి పోయాను," అని భోరున విలపించింది.

"ఆ దైవం అడుగడుగునా ఎందుకీ అనర్థాలు కలిగిస్తున్నాడో అర్థంకావడం లేదు... ఏడవకు, మంజరీ! నీకు కాళ్ళూ చేతులూ లేవని బాధ పడకు. నీకు అన్ని పరిచర్యలూ నేను చేస్తాను. నిన్ను కంటికి రెప్పలా కాపాడుకుంటాను."

"వద్దండీ వద్దు. ఈ శాపగ్రస్తురాలిని ఇంకా ఋణగ్రస్తురాలిని చేయకండి."

"అలా అనకు మంజరీ! నేనే ఈ దుస్థితిలో ఉంటే, నీవు మాత్రం నాకు సేవ చేయవా? భార్యా భర్తలు కష్టసుఖాల్లో ఒకర్నొకరు ఆదు కోవడం దాంపత్య ధర్మం. ఎలాగైనా నీ వ్రతం పూర్తి చేయిస్తాను. నీకు యథారూపు తెప్పిస్తాను!" అన్నాడు మదన్ కృతనిశ్చయుడై.

రంగనాథ్ (మదన్), జయమాలిని (మంజరి)తో పాటు కె. వి. చలం, నాగరాజు, ముక్కామల, రవికుమార్, భీమేశ్వరరావు, కాశీనాథ్ తాతా, ఏమూరి, ఆదినారాయణ, విజయలక్ష్మి, ఎస్. వరలక్ష్మి, రాజేశ్వరి, కల్పనా రాయ్, జయవాణి, జానకి, లతప్రియ పాల్గొన్న విఠల్ ప్రొడక్షన్స్ "మదనమంజరి" జానపద చిత్రం జూన్‌లో విడుదలవుతుందని చెప్పారు దర్శక నిర్మాత బి. విఠల ఆచార్య. కర్పూరపు ఆంజనేయులు రచయిత. విజయా కృష్ణమూర్తి సంగీత దర్శకుడు. హెచ్. ఎస్. వేణు ఛాయా గ్రాహకుడు. కుదరవల్లి నాగేశ్వరరావు శిల్పం; కపిల నాగేశ్వరరావు నిర్మాణ నిర్వహణ; బి. వి. శ్రీనివాస్, బి. వి. పద్మనాభ ఆచార్య, కత్తుల గోపాలకృష్ణ సహ దర్శకత్వం, సుంకర హరి ప్రసాద్ సహాయ దర్శకత్వం నిర్వహిస్తున్నారు.



'కొత్త జీవితాలు'లో హరిప్రసాద్

## సినిమా

### దాసరి దర్శకత్వంలో కర్పూర జ్యోతి

నూతన నటీ నటులతో తయారయ్యే మరో చిత్రం "కర్పూరజ్యోతి" దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో జి. కామరాజు (పూర్ణా) సమర్పిస్తారు. ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం సంగీత దర్శకత్వంలో మే 19న రాజశ్రీ రాసిన పాట రికార్డు చేయబడింది. కె. ఎస్. మణి, బాలు, భాస్కరరాజు ఇతర సాంకేతిక వర్గం. "జూన్‌లో షూటింగ్ ప్రారంభమవుతుంది," అన్నారు నిర్మాత హరగోపాల్. ఉమా ఫిలింస్ కంబైన్స్ పతాకంలో నిర్మాణం.

## కొంటె మొగుడు – పెంకి పెళ్ళాంలో జున్ను కోసం జుల్మానా

"అమ్మా, అల్లుడుగారు కొట్టారే. మీ అల్లుడుగారికి జున్ను కావాలట!" అరున్నొక్క రాగంతో ఫిర్యాదు చేసింది వరలక్ష్మి (అనిత).

"ఇప్పుడు జున్ను ఎక్కడ నుండి వస్తుందే? రాత్రే చెబితే వెంకయ్యని ఎక్కడికైనా పంపించి తెప్పించేదాన్ని," అంది భద్రమ్మ (సూర్యకాంతం).

"అదంతా నాకు తెలీదు ఎక్కడైనా డెలివరీ అయిన గేదె ఉందేమో కనుక్కొని తెప్పించండి!" అరిచాడు అహోబలం (నూతన్‌ప్రసాద్).

"అలాంటివి ఎక్కడాలేవు. చూడల్లుడూ! నా పిచ్చితల్లికి నా తల్లిపేరు పెట్టుకున్నాను. నువ్విలా చీటికి మాటికి దాన్ని చావబాదుతుంటే ఎలా?" అంది భద్రమ్మ.

"ఈ తల్లిని కట్టుకొని ఇల్లరికం రాబట్టే – నా ఆస్తీ, పరువూ ప్రతిష్ఠ మంట గలిసి పోయింది. రంగస్థలంమీద రామ రావణ కృష్ణ కీచక దుర్యోధన కర్ణ సైనిక పాత్రలు ధరించిన నేను, మద్రాసులో పాండి బజారులో ఉండాల్సిన నేను – ఇప్పుడిలా ఉన్నానంటే మీరే కారణం... జున్నుకావాలి."

"ఎక్కడినుంచొస్తుంది, నాయనా?"

"అయితే, అయిదొందలు ఇచ్చుకోండి."

"అలా అన్నావు బావుంది. వావిట్లో మీ మామగారు కూర్చున్నారు. అడిగి తీసుకెళ్ళు."

"ఆ మాట ముందే చెబితే పోయేదిగా?"

కట్టా సుబ్బారావు దర్శకత్వంలో యు. ఎస్. ఆర్. మోహనరావు నిర్మించిన రాజ్యలక్ష్మి కంబైన్స్ "కొంటె మొగుడు – పెంకి పెళ్ళాం" చిత్రం జూన్ 5 విడుదల. చంద్రమోహన్, ప్రభ, పి. ఎల్. నారాయణ, లక్ష్మీకాంత్, రమణ మూర్తి, సూర్యకాంతం, రమాప్రభ, కృష్ణవేణి, జయమాలిని వగైరా నటవర్గం. గొల్లపూడి, సి. నా. రె., వేటూరి, కొసరాజు, జాలాది, సత్యం, మోహనకృష్ణ, ప్రభాకరరావు, వీరప్ప, సి. వి. ఎస్. రామారావు, జి. ఎస్. బాబు ప్రభృత సాంకేతికవర్గం. ★




**వీర్రాజు బియ్యే పాసయ్యాడు. చాలామందిలాగే బెల్‌బాటమ్‌లు వేస్తాడు. పువ్వుల చొక్కాలు తొడుగుతాడు వెత్తి మీద జుట్టు** పొడుగ్గా—ముందు చెవులు, వెనుక కాలరు కన్పించకుండా పెంచుతాడు. అది ఏ కాలమైనా కూలింగ్ గ్లాసెస్ మాత్రం తప్పకుండ పెడతాడు. పొడుగు చేతుల చొక్కా అయితే టక్ చేస్తాడు. పొట్టిచేతులదయితే మామూలుగానే వుంచుతాడు. మొత్తం మీద స్టయిలుగానే వుంటాడని చెప్పాలి.

పాపం బియ్యే పాసయినా వుద్యోగం దొరకలేదు వీర్రాజుకి. చాలా కాలంగా యింటిదగ్గరే ఖాళీగా వుంటున్నాడు. అలాఅని అతనెప్పుడూ యింటిదగ్గరే ఖాళీగా కూర్చుంటాడని చెప్పడానికి వీల్లేదు. ప్రతీరోజూ ఉదయమే ట్రిమ్‌గా తయారై కాలేజీ పెట్టే సమయానికి, విడిచిపెట్టే సమయానికి కాలేజీ కెదురుగానున్న షోడాకొట్టు దగ్గర నిలబడి సిగరెట్ కాలుస్తూ అమ్మాయిలకు పోజిస్తుంటాడు. మిగిలిన సమయాల్లో కాలేజీలో పని లేకపోయినా లేడీస్ వెయిటింగ్ రూము మీదుగా రెండుమూడుసార్లు పచారులు చేస్తాడు. మళ్ళీ సాయంకాలం సినిమాలు బిగిన్ చేసే సమయానికి 'కలెక్షన్ల' (అమ్మాయిల) కోసం అన్ని సినిమాహాళ్ళదగ్గరకు తిరుగుతాడ. ఇతని సంగతి తెలిసిన అమ్మాయిలు 'పాపం!' అని నిట్టూరుస్తారు

నిజంగా వీర్రాజుకి అమ్మాయిలంటే భలే పిచ్చి. వాళ్ళేది చెప్తే అది చేస్తాడు. ఇతని వీక్నెస్ కనిపెట్టిన అమ్మాయిలు వీర్రాజుచేత చిన్న చిన్న పనులు (రిక్షాలు పిలవడం, సినిమాటిక్కెట్లు ముందుగా రిజర్వు చేయడం లాంటివి) చేయించుకుంటారు. చాలామందికి బాడీగార్డుగా వుండి వారి వారి యిళ్ళదగ్గర దిగబెడుతూ వుంటాడు. వీర్రాజు తండ్రి ఏదో ఆఫీసులో పై సంపాదనలేని గుమస్తా వుద్యోగం చేస్తున్నాడు. అందువల్ల వీర్రాజు చేతిలో డబ్బులు ఎప్పుడోగాని వుండేవి కావు. సిగరెట్లకు, చిల్లర ఖర్చులకు కావలసిన డబ్బులను వాళ్ళమ్మగారు పోపుల పెట్టెలో దాచుకున్నవాటిని కాజేస్తూవుంటాడు. వీర్రాజుకి తండ్రిలా గుమస్తా వుద్యోగం చెయ్యాలని లేదు. మంచి ఆఫీసరుద్యోగం అయితేనే చేయాలనుకుంటున్నాడు. అయినా ఉద్యోగం చేస్తుంటే తనిలా తిరగడానికి ఫ్రీడం వుండదనికూడా అతని అభిప్రాయం. అదేమిటోగాని వీర్రాజుకి ఉద్యోగం రాలేదనే బాధ లేదు. తండ్రికి ఇతనో పెద్ద సమస్య అయిపోయాడు. ఇంట్లో ఏ లోటూ రాకూడదంటాడు. దెబ్బలాడి బట్టలు కుట్టించుకుంటాడు. టాయిలెట్ సామాన్లు కొనిపించుకుంటాడు.

అనుకోకుండా ఓ రోజున వీర్రాజుకి ఇంటర్వ్యూ వచ్చింది ఎంప్లాయిమెంటునుంచి. ఇంటర్వ్యూ కాకినాడలో. అదొక గుమస్తా పోస్టు.

# బట్టలమీద మరకలు పడితే ఏం చేయాలి?

**రసాయనిక మరకలు :**

మరకపడిన భాగాన్ని పుల్లని పెరుగులో గాని, పులిమజ్జిగలోగానీ రాత్రంతా నానబెట్టాలి. ఆ తరువాత సబ్బునీటితో పరిశుభ్రపరచాలి.

**[illegible] సంబంధమైన మరకలు**

శుభ్రమైన చన్నీటిలో అమ్మోనియా కలిపి, దానిలో ఆ రకలున్న బట్టలను నానబెట్టి, ఆ తరువాత పిండితే మరకలు పోతాయి.

**నూనె, నెయ్యి మరకలు**

పాత మరకలను తొలగించడానికి పెట్రోలు ఉపయోగించాలి. అప్పుడే పడిన చమురు మరక్ని తొలగించడానికి సబ్బూ, వేడినీరూ చాలు.

**రంగు మరకలు :**

రంగు దుస్తులపైన రంగుల మరకలు పడితే అమ్మోనియానుగానీ, సారాయినిగానీ ఉపయోగించాలి. తెల్లని గుడ్డలకు బ్లీచింగ్ పౌడర్‌ను ఉపయోగిస్తే చాలు

**షూ పాలిష్ మరకలు**

కొబ్బరినూనెలోగానీ, టర్పెంటైన్‌లోగానీ నేసి ఉతకడంవలన షూ పాలిష్ మరకలను తొలగించవచ్చు.

**సిరా మరకలు**

సిరామరక పడినచోట వెంటనే నీటితో కడిగి, నిమ్మరసం వేసి రుద్ది, ఆ వెంటనే ఉప్పు వేసి రుద్దితే మరక పోతుంది.

**తమలపాకుల మరకలు:**

తమలపాకుల మరకలను తొలగించడానికి ముందుగా సబ్బునీటితో ఉతికి పొటాసియం పెర్మాంగనేటును ఉపయోగించి, ఆ తరువాత ఆక్సాలిక్ ఆసిడ్‌ను ఉపయోగించి సబ్బునీటితో పిండాలి.

**టీ కాఫీ మరకలు :**

ఒక టేబిల్ స్పూన్ బ్లీచ్ వేసిన నీటిలో 15 నిముషాలపాటు ఉండనిచ్చి పిండితే మరకలు పోతాయి.

**వృక్ష సంబంధమైన మరకలు :**

పాత మరక అయితే దానిమీద వాషింగ్ సోడానుగానీ, బోరాక్స్ పౌడరునుగానీ చల్లి, దానిమీద మసలుతున్న నీటిని పోయాలి. ఆ తరవాత మరక గల భాగాన్ని సబ్బుతో పిండితే మరకలు పోతాయి. ఎక్కువ మరకలతో గుడ్డ ఉంటే నీటిలో వాషింగ్ సోడానుగానీ, బోరాక్స్ పౌడరునుగానీ కలిపి, దానిలోనే బట్టను నానబెట్టి, తీసి సబ్బుతో రుద్ది ఉతికితే మరకలు పోతాయి. అప్పుడే పడ్డ మరకను తొలగించాలంటే మరుగుతున్న నీటిని మరకపై పోసి, ఎండలో కాసేపు ఉంచాలి.

**అయోడిన్ మరకలు .**

సోడియంసల్ఫేటు ద్రావణాన్ని ఉపయోగించినా, స్పిరిట్‌లో నానబెట్టినా మరకలు త్వరగా పోతాయి.

**పసుపు మరకలు :**

సారాయితో మరకలను తడిపి ఎండలో ఆరవేయాలి.

**గ్రీస్ మరకలు :**

వేడినీరు, సబ్బుతో ఉతికితే పోతాయి.

**వార్నిష్ పెయింట మరకలు .**

కిరసనాయిలులో నానబెట్టి సబ్బుతో ఉతికితే ఈ మరకలు పోతాయి.

**పండ్లరసాల మరకలు:**

పాత మరకలైతే బోరాక్స్ పౌడర్‌ను చన్నీటిలో కలిపి మరకమీద వేసి కాసేపుఉంచాలి. ఆ తరవాత బాగా రుద్దాలి. ఆటు తరువాత వేడి నీటిని పోయాలి. రంగు బట్టలకు పొటాసియం పెర్మాంగనేటును వాడ వచ్చును. అప్పుడే పడిన మరకలయితే వేడినీటితోనే పోయే అవకాశాలుంటాయి.

**తుప్పు మరకలు :**

నిమ్మరసం, ఉప్పు వాడాలి.

**ఎఱ్ఱ సిరా మరకలు :**

సబ్బుతో ఉతికిన తర్వాత బోరాక్స్ ద్రావణంలో ఓ 15 నిముషాలపాటు నానబెట్టాలి. పాత మరకలైతే కాస్త వెనెగార్ కూడా వాడాలి.

**[illegible]టుక మరకలు**

కొబ్బరి నూనెలో నానబెట్టి సబ్బుతో ఉతికితే పోతాయి.

—పి. సుగుణ.

## పాపం! వీర్రాజు

అందులోను టెంపరరీది వీర్రాజుకి ఆ ఇంటర్వ్యూకి వెళ్ళడానికిష్టంలేదు. అదే మాట యింట్లో చెప్పాడు. తండ్రి మండిపడి కారణమడిగాడు. అది గుమస్తా పోస్టని, టెంపరరీ దని చెప్పాడు అప్పుడు తండ్రి ఎంతగానో నచ్చజెప్పాడు. నేటి టెంపరరీదే రేపటి పెర్మనెంటు వుద్యోగమని, నేటి గుమస్తాయే రేపటి ఆఫీసరని, అయినా బియ్యే పాసయ్యి ఇప్పటికే మూడేళ్ళయిందని, ఇలా ఇంకా కొంత కాలముంటే అసలు వుద్యోగమే రాదని చెప్పాడు. అయినా ఆ మాటలు వీర్రాజుకి రుచించలేదు. కాని ఈ విధంగానైనా ఓసారి కాకినాడ వెళ్ళొచ్చునని, సినిమాలు చూడొచ్చునని వెళ్ళడానికి సిద్ధపడ్డాడు.

* * *

ఇంటర్వ్యూలో వీర్రాజుని చూసి ఉలిక్కిపడ్డారు ఆ ఇంటర్వ్యూచేసే అధికారులు. చారల చొక్కా, గళ్ళప్యాంటు, కూలింగ్ గ్లాసెస్, రాగి జుట్టుతో వున్న అతన్ని చూసి దీర్ఘంగా నిట్టూర్చారు. వీర్రాజు లోపలికొచ్చిన వెంటనే అక్కడ ఖాళీగా వున్న కుర్చీలో కూర్చున్నాడు, వాళ్ళు కూర్చోమనకుండానే. వాళ్ళు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. అందులో ఒక అధికారి పేరు, వగైరాలన్నీ అడిగాడు.

"ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి ఎవరు ?" ఇంకో అధికారి అడిగాడు.

"వాజ్‌పాయ్" అని తక్కువ సమాధానమిచ్చాడు.

దాంతో అదిరిపోయారా అధికారులు. ఇంకా అడిగితే రాబోయే సమాధానాలను వూహించుకుని, భయపడి ఇంక వెళ్ళమన్నారు, రిజల్టు తర్వాత తెలియజేస్తామని. వీర్రాజు బయటకొచ్చాడు.

ఆరోజు కాకినాడలోనేఉండి రెండు సినిమాలు చూసి మర్నాడు ఉదయమే బయలుదేరాడు. బస్టాండులో అమలాపురం పోవడానికి డైరెక్టు బస్సుంది. అందులో వెళ్ళాలనుకున్నాడు కాని వెంటనే అదెక్కకుండా నిలబడిపోయాడు. కారణమేమిటంటే — నల్గురు అమ్మాయిలు (అంతా 'మిస్'లే) నిలబడి కబుర్లు చెప్పుకుంటున్నారక్కడ. అప్పుడప్పుడు వోరగా వీర్రాజు ఆకారాన్ని చూసి ముసి ముసి నవ్వులు నవ్వుకుంటున్నారు. దానితో వీర్రాజుకి భలే హుషారు వచ్చేసింది. అసలు వీర్రాజుకి తన అందంమీద ఎంతో నమ్మకం. ప్రతీ అమ్మాయి తనవంక చూస్తుందని, మోహిస్తుందని అనుకుంటూ వురిటాడతను. కానీ చూసిన ప్రతీవారూ 'ఎవరీ జంతువు' అని చూస్తారని అతనికి తెలీదు.

పేపరు చదువుతున్నట్టు నటిస్తూ కూలింగ్ గ్లాసెస్‌లోనుంచి వాళ్ళని గమనిస్తున్నాడు. వాళ్ళ మాటల్నిబట్టి వాళ్ళూ అమలాపురమే వెళ్ళాలని, డైరెక్టు బస్సయితే చుట్టూ తిరిగి వెళుతుంది కాబట్టి బాగా లేటవుతుందని, కోటిపల్లిరేవు దాటి వెళ్ళాలని, అంతేకాకుండా వాళ్ళలో యిద్దరు ఎప్పుడూ రేవు ప్రయాణం చెయ్యలేదని, అందుకనిప్పుడు అంతా కలిసి కోటిపల్లి మీదనుంచి వెళ్ళాలని నిర్ణయించుకున్నారని గమనించాడు.

'ఆహా! ఏమి నా భాగ్యము' అనుకున్నాడు వీర్రాజు. వాళ్ళతో కలసి ప్రయాణం చేయవచ్చునని ఉబలాటపడ్డాడు. అంతలో కోటిపల్లి బస్సు రానే వచ్చింది. అదెప్పుడూ రష్‌గా వుంటుంది. అది కూడా ఒకందుకు మంచిదే అయింది వీర్రాజుకు. బస్సంతా నిండిపోయిన తర్వాత ఎక్కి లేడీస్ సీట్ల దగ్గరే నిలబడి సిగరెట్ కాలుస్తూ ఆ నల్గురికి సైడ్ పోజు లిస్తున్నాడు.

కోటిపల్లి రేవులో బస్సు దిగేసరికి అప్పుడే రేవు నావ బయలుదేరి కొంత దూరం వెళ్ళిపోయింది. అవతలి ప్రక్కన కూడా సరిగ్గా యిప్పుడే బయలుదేరి వుంటుంది కాబట్టి రేవు నావ రావాలంటే గంట పడుతుంది. ఈలోగా వెళ్ళాలనుకుంటే ప్రయివేట్ నావల్లో పోవాలి. చాలా మంది అలానే పోతున్నారు. ఆ నల్గురమ్మాయిలు

# రెక్సోనా మీ చర్మాన్ని సంరక్షిస్తుంది...





# మృదువుగా మెరిసేలా ఉంచుతుంది

**రెక్సోనాలో ఉంది సహజ సిద్ధమైన నాలుగు నూనెల సమ్మేళనం—**

హాపుషా (దేవదారు జాతి), లవంగ పట్ట, లవంగ, సరళం. రెక్సోనాతో స్నానం చెయ్యండి—అది మీ చర్మాన్ని మృదువుగా మెరిసేలా ఉంచుతుంది. మీరెంతో ఇష్టపడే పరిమళాన్ని చర్మంపై నిలిపి గుబాళింపజేసే రెక్సోనా, మీ చర్మ సంరక్షణ కోసం సహజమైన సాధనం.




# రెక్సోనా మీ చర్మ సౌందర్యం కోసం

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్-RX.76-2316 TL



'కొంటెమొగుడు — పెంకిపెళ్ళాం'లో నూతన్‌ప్రసాద్, జయమాలిని

అక్కడే నిలబడిపోయారు ఏం చెయ్యాలో తెలియక. వాళ్ళనే గమనిస్తున్న వీర్రాజుకి ఓ ఆలోచన వచ్చింది. వెంటనే వాళ్ళదగ్గరకెళ్ళి "ఎక్స్‌క్యూజ్ మి! మీరు కూడా అమలాపురమే వెళ్ళాలను కుంటాను." అన్నాడు రెండు చేతుల్నీ ప్యాంటు జేబుల్లో పెట్టుకుని స్టయిల్‌గా నిలబడి. ముందు వాళ్ళు విస్తుపోయారు వీర్రాజు ధైర్యానికి

"అవునండి" అంది ఓ గడుగ్గాయి.

"మీకు అభ్యంతరం లేకపోతే మనమంతా కలసి ఒక ప్రయివేట్ నావ మాట్లాడుకుని రేవు దాటేద్దాం. ఎండొస్తే అసలు వెళ్ళలేం. అయినా లేటయ్యేకొద్దీ అవతల బస్సులుండవు" అన్నాడు

ముందువాళ్ళు 'నీ పని నువ్వు చూసుకో మా గొడవెందుకు' అని అందామనుకున్నారు కాని, తర్వాత 'సరే' అన్నారు.

వెంటనే వీర్రాజు అయిదుగురికి ఒక పడవ రెండు రూపాయలకు మాట్లాడాడు. రేవు టిక్కెట్లు కూడా తనే కొన్నాడు వాళ్ళు డబ్బు లిచ్చినా తీసుకోకుండా. అంతా పడవెక్కారు.

"ఓ సెనం వుండండి బాబయ్యా! సుట్టముక్క ఎలిగించుకొత్తాను" అంటూ పడవవాడు పడవను నీళ్ళలో పాతిన గెడకి కట్టేసి వెళ్ళాడు.

ఆ నల్గురమ్మాయిలు పడవ మధ్యనున్న కమ్మీమీద కూర్చున్నారు. వీర్రాజు పడవలో నిలబడి పై అంచుమీద ఒక కాలేసి సిగరెట్ కాలుస్తున్నాడు.

ఇంతలో నల్గురైదుగురు కుర్రాళ్ళు నీళ్ళలో యీదుకుంటూ వీళ్ళున్న పడవదగ్గరకొచ్చారు.

## పాపం! వీర్రాజు

"ఓ అయిదు పైసలు నీళ్లలో ఎయ్యండి. మీకు తీసి సూపిత్తాం" అన్నాడో కుర్రాడు.

అమ్మాయిలంతా వింతగా చూసారు వాళ్ళ వంక. వీర్రాజు అయిదు పైసలు తీసి నీళ్ళలోకి దూరంగా విసిరాడు. వాళ్ళలో ఒకడు గబగబా ఈదుకుంటూపోయి అది పడినచోట మునిగి అయిదు పైసలు తీసి చూపించాడు అమ్మాయిలు ఆశ్చర్యపోయారు అది చూసి. వాళ్ళుకూడా తలో అయిదు పైసలు విసిరారు అక్కడున్న కుర్రాళ్ళు యీదుకుంటూపోయి తీసి చూపించారు. అమ్మాయిలకు చాలా ఆనందం వేసింది. అది కనిపెట్టాడు వీర్రాజు. ఈసారి అర్ధరూపాయి తీసి యింకా దూరంగా విసిరాడు. వాళ్ళు పోటీలుపడి యీదుకుంటూపోయారు. ఓ కుర్రాడు తీసి చూపించాడు. దాన్నికూడా వాణ్ణే తీసేసుకోమన్నాడు. అమ్మాయిలంతా వీర్రాజు వంక సాభిప్రాయంగా చూసారు. దానితో వీర్రాజుకి బాగా హుషారొచ్చేసింది. వాళ్ళనింకా సంతోషపెట్టా లనుకున్నాడు. తక్షణ ఓ ఆలోచన వచ్చింది. చేతికున్న వాచీవంక చూసాడు. అది వాటర్‌ప్రూఫ్‌ది నీళ్ళలోపడ్డా పర్వాలేదు. వెంటనే ఓ కుర్రాణ్ణి పిలిచి "ఒరేయ్! ఈ వాచీని నీళ్ళలోకి విసురుతాను తీస్తావా?" అన్నాడు అమ్మాయిలవంక ఓరకంట చూస్తూ.

తీస్తానన్నాడా కుర్రాడు. అమ్మాయిలంతా ఆశ్చర్యంగా చూసి వీర్రాజుకు దగ్గరగా వచ్చి నిలబడ్డారు మరింక ఆలోచించకుండా వీర్రాజు చేతికున్న వాచీని తీసి దూరంగా నీళ్ళలోకి విసిరాడు. అది తీసినవెంటనే ఆ కుర్రాడికి అయిదు రూపాయి లిచ్చి తన దాతృత్వాన్ని వాళ్ళముందు ప్రదర్శించా లనుకున్నాడు.

ఆ కుర్రాడు ఈదుకుంటూపోయి వాచీ పడిన చోట మునిగాడు. అలా మునిగినవాడు వెంటనే పైకి తేలలేదు. అమ్మాయిలంతా క్యూరియాసిటీతో చూస్తున్నారు. వీర్రాజుకి లోపల్లోపల భయంగానే వుంది వాడు తీస్తాడో లేదోనని.

ఆ కుర్రాడు అయిదు నిమిషాల తర్వాత పైకిలేచి దొరకలేదని రెండు చేతులు త్రిప్పి మళ్ళీ నీళ్ళలోకి మునిగాడు. అలా రెండు మూడుసార్లు మునిగి దొరకలేదని చెప్పాడు. వీర్రాజుకి పైప్రాణాలు పైనే పోయాయి. అక్కడున్న కుర్రాళ్ళందరికి చెప్పాడు, ఎవరు తీస్తే వాళ్ళకి పది రూపాయ లిస్తానని. వాళ్ళంతా ఈదుకుంటూపోయి మునిగారు. లేచి దొరకలేదని చెప్పారు

వీర్రాజుకి ఏడుపు ఒక్కటే తక్కువ. ఇంతలో పడవవాడు వచ్చి ఏమిటని అడిగాడు. జరిగిందంతా వాడికి చెప్పి వాణ్ణికూడా వెతక మన్నాడు.

"ఎంతపని చేసారయ్యా. ఏదో పైసలయితే ఆ కుర్రనాయాళ్ళు తీత్తారుగాని ఇటువంటివి అల్లా తియ్యలేరు. అది నీళ్లల్లోపడివెంటనే పడిన సోటుండక కొట్టుకుపోతాది. అయినా వాచీని నీళ్లల్లోకి ఎవరైనా యిసురుతారా" అంటూ వాడు కూడా ఈదుకుంటూ పోయి రెండుసార్లు మునిగి వెదికాడు.

"ఇంక దొరకదు బాబయ్యా" అంటూ పడవెక్కి బట్టలు పిండుకుంటున్నాడు.

వీర్రాజుకి నోట్లోనుంచి మాటలు రావడం లేదు. అమ్మాయిలంతా అతనికేసి జాలిగా చూస్తున్నారు.

వాళ్ళని చూసిన వెంటనే "పోతేపోయిందిలే వెధవ్వాచీ, ఇంకోటి కొనుక్కోవచ్చు" అని వాళ్ళ ముందు ప్రగల్భాలు పలికాడు తనేదో గొప్పవాడినని వాళ్ళు అనుకోవాలని. కాని వీర్రాజు మనస్సులో భయం భయంగా వుంది. ఆ వాచీ తన స్వంతానిది కాదు. నిన్న ఇంటర్వ్యూకి బయలుదేరుతూ తన ఫ్రెండు నడిగి తీసుకున్నాడు, తిరిగొచ్చి ఇచ్చేస్తానని. వాడికేం చెప్పాలా అని ఆలోచిస్తూ బాధపడుతున్నాడు.

పడవ నెమ్మదిగా బయలుదేరింది అక్కడ నుంచి.

— యిక్కడ ఎవరికీ తెలియని రహస్య మొకటుంది.

వీర్రాజు నీళ్ళలోకి వాచీని విసిరిన వెంటనే ఆ కుర్రాడు ఈదుకొంటూ పోయి నీళ్ళలోకి మునిగి పైకి లేచేలోగా నీళ్ళ అడుగునవున్న వాచీని తీసి తన కాలి బొటనవ్రేలికి చుట్టుకున్నాడనిగాని, అందుకే అయిదు నిముషాలవరకు పైకి తేలలేక పోయాడని, రెండు మూడుసార్లు వెతుకుతున్నట్లు నాటకమాడాడని, పడవ కొంత దూరం పోయాక ఒడ్డుకొచ్చి ఆ వాచీని తీసుకుని ఇంటికి పోయాడనిగాని ఎవరికీ తెలీదు. ముఖ్యంగా వీర్రాజుకి.

పాపం వీర్రాజు!

# ఉత్తమమైన పౌడర్లు ఖరీదైనవి
# మరియు చౌక పౌడర్లు తేలిక రకాలు

# కాని
# స్వస్తిక్ ఉతికే పౌడర్
# అన్నిటికన్నా విభిన్నమైనది




2 కిలోలు,
1 కిలో,
500 గ్రాములు
మరియు
200 గ్రాములు
క్రొత్త పోలిప్యాక్ లో

స్వస్తిక్ ఉతికే పౌడర్ అన్నిటికన్నా విభిన్న మైనది ఎందుకంటే దీనిలో మితవ్యయము ఉత్తమము అపురూపముగా కలిసినవి. అంటే ఇది చౌక మరియు ఉత్తమమైనది!

నీలి
**స్వస్తిక్**
డిటర్జెంట్ ఉతికే పౌడర్

Shilpi-DM 24/80 Tel

సామర్థ్యాన్ని సెక్రటరీకి చూపించుకోవాలని పట్టుదల **కూడా** అతనిలో ప్రవేశించింది.

ఏమయినాసరే, రెండు రోజుల్లో పెండింగ్ పన్యంతా పూర్తి చేయాలని నిశ్చయించుకున్నాడు రాజారాం.

చేయదల్చుకుంటే ఎంతటి పనైనా తాను చేయగలడనీ — కానీ ఏవో కొన్ని అనివార్య పరిస్థితులవల్ల ఈమధ్య కొంచెం పనిలో అశ్రద్ధ చూపుతున్నాడనీ — సెక్రటరీ తెలుసుకునేలా చేయాలనుకున్నాడు

సాయంత్రం అయిదుగంటలకు, ఆఫీసులో అందరూ వెళ్ళిపోయినా రాజారాం మాత్రం, తన సీటులోంచి కదల్లేదు. ప్యూన్‌చేత టీ తెప్పించుకున్నాడు.

టీ తాగి, సిగరెట్టు వెలిగించుకుని — కుర్చీలో వెనక్కు జారగిలబడి కళ్ళుమూసుకున్నాడు

అంతలోనే, కుడిప్రక్కన కణతలో సన్నగా తలనెప్పి ప్రారంభమయింది. నోరంతా తడారిపోయినట్లు అనిపించసాగింది. వళ్ళంతా చెమటలు పోస్తున్నాయి. వాంతి వస్తున్నట్లు అనిపిస్తే బాత్‌రూంకి వెళ్ళివచ్చాడు.

ఆ క్షణంలోనే అతనికి గుండెపోటు ప్రారంభమయింది. సగంకాలిన సిగరెట్టును మరికాల్చలేక, యాష్‌ట్రేలో పడేశాడు. ఒళ్ళంతా చెమటలు పట్టి బట్టలు తడిసిపోతున్నాయి... తనకేదో అయిపోతున్నట్లు అనిపించింది

వెంటనే ప్యూన్‌ని పిలిచాడు.

"నాకు గుండెల్లో నెప్పిగావుంది త్వరగా నన్ను ఇంటికి తీసుకెళ్ళాలి! " ఓచేత్తో గట్టిగా గుండెను అదిమి పట్టుకుంటూ అన్నాడు

రాజారాం పరిస్థితిని గమనించిన ప్యూన్— నిముషాలమీద ఆటోరిక్షా తీసుకొచ్చాడు. రాజారాం, ఇంటికి చేరుకునేసరికి గుండెపోటు తీవ్రమయింది. మాట్లాడేస్థితిలో కూడా లేదు.

భర్తను ఆ స్థితిలో చూసిన జానకి బావురుమంది

'వెంటనే ఉస్మానియా ఆస్పత్రిలో చేర్పటం మంచిద'ని పక్కింటావిడ సలహా ఇచ్చింది.

అసలే నెలాఖరు రోజులు... తన దగ్గర పట్టుమని పదిరూపాయలు కూడాలేవు.

ప్రక్కింటావిడే, ఎక్కడనుంచో పాతిక

# అనుభూతి — అనుబంధం

[ 24వ పేజీ తరువాయి ]

రూపాయలు తెచ్చి జానకి చేతిలో పెట్టింది.

ఇద్దరు ఆడపిల్లల్నీ ఇంటికి కాపలా వుంచి ఆఖరువాడ్ని సాయం తీసుకుని — అదే ఆటోరిక్షాలో ఆస్పత్రికి చేరుకుంది జానకి.

అప్పటికి రాత్రి ఏడుగంటలు దాటింది... ఎమర్జెన్సీ వార్డులో జనం పల్చగానే వున్నారు.

రాజారాంని పరీక్షించిన డాక్టర్లు వెంటనే ఇంజక్షన్లు ఇచ్చారు...భరించలేని గుండెపోటుతో మాట్లాడలేక పోతున్నాడు రాజారాం.

"ఈ గుండెపోటు ఇంకో ఇరవైరోజుల తర్వాతైనా రావలసింది! అప్పటికి భానూ వచ్చేవాడు" — మనసులో అనుకుంటున్నట్టుగా అతికష్టంమీద — అస్పష్టంగా అన్నాడు.

"పోనీ రామానికి టెలిగ్రాం ఇవ్వమంటారా, రమ్మని ?" — ఆందోళనగా అడిగింది జానకి.

వద్దని చేత్తోనే వారిస్తూ —

"అసలే కొత్త ఉద్యోగం...వెళ్ళి ఇంకా పదిరోజులయినా కాలేదు"— అన్నాడు.

ఆ తర్వాత అయిదు నిముషాలసేపు మృత్యువుతో పోరాడి అలసిపోయాడు రాజారాం. భర్త అలా నరకయాతన అనుభవిస్తూంటే నిస్సహాయంగా — కన్నీటి పొరల్లోంచి చూస్తూవుండి పోయింది జానకి. డాక్టర్లు తమ ప్రయత్నం తాము చేశారు.

కానీ రాజారాం బ్రతకలేదు.

జానకి ఘొల్లుమంది... ఆఖరివాడు 'నాన్నా' అంటూ తండ్రి కాళ్ళను చుట్టేసుకుని ఏడుపు ప్రారంభించాడు.

అక్కడ వాళ్ళను ఓదార్చటానికి ఎవ్వరూ లేరు. ఓవైపు ఆమెను సముదాయిస్తూ— డాక్టర్లూ నర్సులూ ఏవో ప్రశ్నిస్తున్నారు.

అప్పటికి రాత్రి ఎనిమిది గంటలు దాటింది.

సరిగ్గా అదే సమయంలో —

భానుమూర్తి అక్కడకు వచ్చాడు. దేవుడు పంపించినట్టే వచ్చాడు.

ఎవరో అన్నట్టు — చిన్న దుఃఖాలు మనిషిని అల్లరి పెట్టి వదిలేస్తాయి. కానీ పెద్ద దుఃఖాలు మనిషిని మూగవాడ్ని చేసేస్తాయి.

ఆ విషాద దృశ్యం చూసి, మాటరాక శిలాప్రతిమలా నిలబడి పోయిన తమ్ముడ్ని కౌగిలించుకుని దీనంగా విలపించింది జానకి.

అక్కయ్య కళ్ళల్లోకి చూడలేకా, ఆమెను ఓదార్చలేకా — మేనల్లుడ్ని దగ్గరకు తీసుకున్నాడు భానుమూర్తి. అక్కడ డాక్టర్లకు ఇవ్వవలసిన వివరాలన్నీ ఇచ్చి టాక్సీలో శవాన్ని ఇంటికి తీసుకొచ్చాడు. ముఖ్యమైన వారికందరికీ టెలిగ్రాములు పంపించాడు.

జానకీ, పిల్లలూ ఏడుస్తూంటే చుట్టుప్రక్కలవాళ్ళు వచ్చి ఓదార్చారు. ఆ రాత్రి తెల్లవార్లూ బావగారి భౌతికదేహం పక్కనే కూర్చున్నాడు భానుమూర్తి.

పూనానుంచి రామం వచ్చేసరికి ఆలస్యం కావచ్చుననే కారణంవల్ల భానుమూర్తే స్వయంగా రాజారాం భౌతికదేహానికి దహన క్రియలు చేశాడు.

రెండోరోజు రాత్రికి రామం వచ్చాడు. మూడోనాటికి బంధువులంతా వచ్చారు. ఎవరొచ్చి మాత్రం ఏం చేయగలరు ?... కొందరు రావాలి కనుక వచ్చారు. మరి కొందరు జానకినీ, పిల్లల్నీ ఓదార్చటానికి వచ్చారు.

అందరి మాటా ఎలావున్నా — తాను రావటమేవిచిత్రమనిపించింది భానుమూర్తికి. వచ్చినందుకు కర్మకాండనంతా తన చేతులమీదుగా జరిపించాడు. పన్నెండేళ్ళు తనను పెంచి పెద్దవాడ్ని చేసినందుకు ప్రతిఫలంగా బావ తలకు తాను కొరివిపెట్టాడు.

అది తన అదృష్టమనుకోవాలా? దురదృష్టమనుకోవాలా ?...

*[ ఇంకా వుంది ]*

**గమనిక**

వ్యక్తులపేర మీ రచనలు పంపితే వాటి పరిశీలనలో ఆలస్యం జరిగే ప్రమాదాలెక్కువ కనుక మీ రచనలన్నీ కూడా శీర్షిక పేరు కవరుపైన లేదా కార్డుపైన ఉదహరిస్తూ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ - 520 003 అను చిరునామాకి పంపండి. - సం.

అనివార్య కారణాలవలనే బొమ్మల భారతం పడలేదు —సం॥

"ఇంటికి వెళుతున్నారా?" అని అడిగాడు విశ్వం.

"అవును. మా ఇంటికి వస్తారా? మా అమ్మ మిమ్మల్ని చూడాలంటోంది."

"నా గురించి మీ అమ్మగారికెలా తెలుసు?"

"ప్రతిరోజూ మీ గురించి చెప్తుంటాగా! రెండు వీధులు దాటితే మా ఇల్లు వస్తుంది. రండి."

"నేను రాను." అతడన్నాడు సూటిగా వచ్చిన బదులు విని ఆమె ముఖం చిరుచెక్కింది. బొట్టు లేని ముఖంలోకి తేరిపార చూచి, అతడు నవ్వుతూ "ఎందుకు రారని అడగరేం?" అని అడిగాడు.

"అలా అడిగే అధికారం నాకు లేదండీ."

"అధికారాన్ని ఒకరు ఇవ్వరు. మనమే తీసుకోవాలి." అది విని ఆమె నవ్వింది. కృష్ణ చేతిలో నుండి జారిపోయిన బంతిని ఒక్క పరుగున వెళ్ళి మళ్ళీ అందుకున్నాడు.

"సరే చెప్పండి. ఎందుకు రారు? ముఖ్యమైన పనుందా?"

# డైరీలో ఒక కొత్తపేజీ

(18వ పేజీ తరువాయి)

"కాదు. మీరు ఓ బదులివ్వి తీరాలి. అప్పుడు గాని మీ ఇంట్లో అడుగు పెట్టను."

"అడగండి?"

"అకౌంట్సు ఆఫీసు విషయమై వాళ్ళు తరచుగా ప్రస్తావిస్తుంటారు. వాళ్ళ మాటల్లోని నిజానిజాలు తెలుసుకోవాలి." ఆమె కొంచెం సేపు మౌనం వహించింది. కృష్ణ చేతిలో బంతి మళ్ళీ జారి దొర్లిపోయింది. దానిని అందుకోవడానికి మళ్ళీ పరుగెత్తాడు.

"రేపు వివరంగా చెప్తాను. నా మాట నమ్మండి. ఇప్పుడు మా ఇంటికి రండి. మీరు గాని మా ఇంటికి వస్తే నాకు ఎంత సంతోషంగా ఉంటుందో మీకు తెలియదు. నా కోరిక మన్నించరూ?" ఆమె అలా అభ్యర్థించేటప్పుడు ఆమె కళ్ళు చెమ్మగిల్లి ఉండడం విశ్వం చూశాడు.

"ఛీ! అంత నిస్పృహాయంగా మాట్లాడకూడదు. పదండి వస్తున్నాను. కృష్ణను సైకిల్ పైన కూర్చోబెట్టండి." జారిపోయిన బంతిని అందుకొని కృష్ణ తల్లి చాచిన చేతుల్లోకి ఒదిగాడు. సైకిల్ పైన కూర్చోబెట్టిన వెంటనే సంతోషం పట్టలేక బెల్‌ను మ్రోగిస్తూ తల్లి వేపు చూసి నవ్వుతున్నాడు.

* * *

మరునాడు పార్వతి ఆఫీసు ఆవరణలో గాని, క్యాంటీనులో గాని కనిపించలేదు. కాని అతడికి తెలుసు—ఆమె తప్పకుండా కనిపించి తీరుతుందని. అతడి నమ్మకాన్ని వమ్ము చేయకుండా, సాయంత్రం ఐదుగంటలకు, అతడు సీట్లో నుండి లేచి బయలుదేరడానికి సిద్ధమవుతుండగా "విశ్వంగారూ!" అని పిలిచి పార్వతి అతణ్ణి సమీపించింది. ఆమేదో చెప్తుందని ఎదురు చూశాడు కాని ఆమె మాట్లాడలేదు. అతడి చేతికి ఓ పుస్తకం అందిచ్చి వెళ్ళిపోయింది. అతడికి అర్థం కాక, పుస్తకం వేపు తేరిపార చూశాడు. భగవద్గీతపై ఎవరో స్వామీజీ వ్రాసిన వ్యాఖ్యానం అది. అతడు పుస్తకం

ఆయన సలహా ప్రకారం ఆయన పని చేస్తూన్న ఆఫీసులో ఉద్యోగానికి అప్లయ్ చేశాను. ఆయన తన పొజిషన్‌ని ఉపయోగించి ఉద్యోగానికి మొదటి మెట్టుగా ఇంటర్వ్యూ కార్డు వచ్చేటట్లు చేశారు. నాకు తెలుసు ఉద్యోగం లభిస్తుందని. ఇంటర్వ్యూ కార్డు అందుకున్న రోజు సాయంత్రం ఆయనను కలుసుకొని ఓ కొత్త వాచీని ఆయనకు సమర్పించాను. ఆయన మృదువుగా దానిని తిరస్కరించి, మరింత మృదువుగా నవ్వుతూ ఇలా అన్నారు —

"నన్ను మీ కష్టాలు ఏ విధంగా కదిలించాయో— అదే విధంగా మరొకటి నన్ను తీవ్రంగా కదిలించింది...అదే మీ అందం."

త్రుళ్ళిపడ్డాను. కాని ఆయన మాత్రం చెక్కు చెదరలేదు. నాకు కూడా పవిత్రంగా ఉండాలనే ఇష్టం. ఒకరి చేతిలో పడ్డ పువ్వు వాడి నలిగి పోతున్నప్పుడు— పదిమంది చేతిలోగాని ఆ పువ్వు పడితే, దాని గతి ఏమవుతుంది? నాకు తెలుసు. కాని మగవాళ పిడికిళ్ళు నన్ను పొదిస్తేగా? అటు వేప కాయ పడి పోయిన భర్త— ఇటువేపు ఏమీ లేని పసికందు. వీళ్ళ తలపులు నన్ను ఉక్కిరి బిక్కిరి లేకుండా చేశాయి. నేను నిజం చెప్తున్నాను. నా అందాన్ని ఆయన అనుభవించాడు. నా అందాన్ని ఆయనకి సమర్పించడం అదే మొదటిసారి— అదే చివరిసారి కూడాను. ఆ రోజు నుండి నాలో నిర్లిప్తత ప్రవేశించింది. నా భర్తను నేను మోసం చేశానన్న తలంపు నాలో ఏనాడూ ప్రవేశించలేదు. ఎందుకంటే— అతడియందు నా కేనాడూ ప్రేమగాని, గౌరవంగాని కలగలేదు. అయినా ఎందుకో తెలియదు, నాగుండెలో ఆనాటి నుండీ నిర్లిప్తత గూడు కట్టుకుంది.

ఉద్యోగంలో చేరిన ఆరునెల్లకు నేను పర్మనెంటు నయాను. అకౌంట్సు ఆఫీసరు నన్ను సరిగ్గా అర్థం చేసుకోలేక— నన్ను పూర్తిగా ఆక్రమించుకోవాలని ఆశపడ్డాడు. అది దురాశని ఎంత నచ్చజెప్పినా, ఆయన తన ప్రయత్నం కొనసాగిస్తూనే ఉన్నాడు. నన్ను పది మంది ముందు చులకన చేసింది మీ సెక్షన్ క్లర్కులు కారు. ఆయనే నన్ను చులకన చేశారు. నన్నందరూ అలా ఈసడిస్తూ ఉంటే ఆయన వంచన బేరు కానని మనసు త్ఫరీత్యా అంచనా వేసాడు.

# డైరీలో ఒక కొత్తపేజీ

ఆయన బారినుండి తప్పుకోవాలని ట్రాన్స్‌ఫర్ కోసం ఏన్నాళ్ళనుండి ప్రయత్నిస్తున్నావో మీకు తెలుసా? ఏట కేలకు అదృష్టం కలిసివచ్చి మొన్న ట్రాన్స్‌ఫర్ లభించింది.

చిక్కటి చీకటిలో ఒంటరిగా వెళితే కుక్కలు వెంటబడతాయి. మగవాణ్ని చూసి వెనక్కి తగ్గుతాయి. ఆడదాన్ని చూసి పైన బడటానికి ప్రయత్నిస్తాయి. అందుకే పరుల అవాకుల్ని— చవాకుల్ని చిరునవ్వుతో స్వీకరించేందుకు అలవాటు చేసుకున్నాను. ఒక విషయం చెప్తే మీకు కాస్తంత కోపం కలగవచ్చు. నేను ఆఫీసుకు వచ్చేటప్పుడు నుదుట తిలకం దిద్దుకొనే రావాలనుకున్నాను. అమ్మ అడ్డగించింది. ఆ



## అన్నీ కలలే!

చదువొక కల; ఉద్యోగ మొక కల;
ఇల్లొక కల; పెళ్ళి ఒక కల—
సొంత మొగుడితో అర్ధరాత్రి
నడివీధిలోకలిసి నడుద్దామనుకోవడమొక కల;
బలాత్కారాన్నెదిరిద్దామను కోవడమొక
కలలోని కల —
కలల్ని ప్రదర్శిస్తున్నారు
చీప్‌గా వెండి తెరమీద చూసుకో!
కలల్ని పంచుతున్నారు నవలల్లో
కొని చదువుకో!
కలల్ని ప్రసారం చేస్తున్నారు గాలిలో
ఆన్‌చేసి ట్యూన్ కలిపి వినుకో!

— కె. శివకుమార్



తలంపు నా కెందు కొచ్చిందంటారా? నా జీవితంలో నా కేనాడూ భర్త ఉన్నట్లు జ్ఞాపకం లేదు.

జీవితంలో చీకటి— పరిసరాల్లో చీకటి. జ్ఞాపకాల అట్టడుగున చీకటి. నాకు రెండే రెండుసార్లు వెలుగు కనిపించింది. మా నాన్నగారి ఒడిలో కూర్చుని నిశ్చింతగా కేరింతలు కొట్టినప్పుడు, ఇప్పుడు మీ నిష్కళంకమైన స్నేహం లభించినప్పుడు. మీ స్నేహం నా హృదయంలో ఒక దీపం.

పార్వతి.

ఆ రోజు రాత్రి విశ్వం దీర్ఘంగా ఆలోచించాడు. క్షణాలు— నిమిషాలు— గంటలు ఆలోచనల రెక్కలెక్కి, ఊహల ఊరేగింపులో కలిసిపోయి, కాలపరివాదిని సుతారంగా మీటుతూ వెళ్ళి పోయాయి. తలపుల తీవ్రతకు, ఆలోచనల ఘర్షణకు ఉక్కిరి బిక్కిరయి, ఆ తరవాత మనసుని విశ్వలవైపు పరోక్షరంగా మార్చుకొని, డైరీలో ఒక కొత్త పేజీతిప్పి, ఇలా వ్రాసుకున్నాడు —

"పార్వతి తనకు ట్రాన్స్‌ఫర్ అదృష్టవశాత్తు లభించిందని వ్రాసింది. నాకు అదృష్టంలో ఎప్పుడూ నమ్మకం లేదు. పాపం ఆమెకు తెలియదు. యూనియన్ కమిటీ మెంబరుగా ఎలక్టయి సెక్రటరీ సహాయంతో ఆమెను మరో సెక్షన్‌కి ట్రాన్స్‌ఫర్ చేయించింది నేనేనని ఆమెకు తెలియదు.

ఆ రోజు ఆమె చేతిలోని విభూతి పొట్లం భక్తితో అందుకోవడం చూసి నాకు దైవభక్తి అధికంగా ఉందనుకోవచ్చు. నేను దేవుడి గుడికి వెళ్ళి, రోజులు కావు — వారాలు— నెలలు కావు — ఏళ్ళు దాటాయని ఆమె కెలా తెలుసు?"

* * *

మరునాడు విశ్వం, అందరూ చూస్తుండగానే పార్వతి సెక్షన్‌లోకి వెళ్ళి, నవ్వుతూ ఆమెకు ఓ కాగితం పొట్లం ఇచ్చి వెళ్ళి పోయాడు. అతడి చొరవను చూసి మొదట్లో కంగారు పడ్డా ఆ తరువాత సర్దుకొని పొట్లాన్ని డ్రాయరులో పెట్టుకుంది. పని చేస్తున్నదన్న మాటే గాని మనసు వాచీ పైనే ఉంది. కాఫీ టైముకి సెక్షన్ ఖాళీ అయిన తరువాత ఆమె మెల్లగా పొట్లం విప్పి చూసింది.

ఆమె గుండె క్షణకాలం పాటు ఆగి పోయింది.

ఆలోచనల ప్రవాహం అకస్మాత్తుగా నిలిచిపోయింది.

తళ తళ మెరుస్తూ ఓ కొత్త బరణి కనిపించింది.

వణుకుతున్న చేతులతో ఆమె విప్పి చూసింది.

బరణి నిండుగా కుంకుమతో నవ్వుతోంది.

# ఫాలాక్షుని డైరీ

## అభ్యంతరం !

శివాజీ వియత్నాం వీడు అనే ఓ నాటకంలోని ఓ డైలాగులో 'నాపిల్లలు నాకెప్పుడూ మంచివాళ్ళు గారు. దానికి నేనేం బాధపడను. అంతటి గాంధీ మహాత్ముని పిల్లలే ఆయనకు మంచి వారుగా లేరు' అని వున్నదట. ఈ డైలాగుకు గాంధీ మహాత్ముని మనుమలలో ఒకరైన ఓ ఐ. ఏ. ఎస్. ఆఫీసరు అభ్యంతరం చెప్తూ శివాజీగణేశన్‌కు ఓ ఉత్తరం రాస్తే, ఇలా గొడవలు మనకేలా అని శివాజీ తన నాటకంలోంచి, ఆనకది సినిమా అయినప్పుడా సినిమాలో కూడా ఆ డైలాగు లేకుండా చేశారట.

## గూడ్సు కన్నా చీమే నయం !

1978 వ సంవత్సరం ఏ డిసెంబరు నెలలో బజార్‌నుంచి బొగ్గు వ్యాగనొకటి హనుమాన్‌గఢ్‌కి బయలుదేరి కరవేగంతో 1980 వ సంవత్సరం మార్చి 29 వ తేదీనాటికి చేరిపోయిందట. ఒక చీమ బజార్‌లో బయలుదేరి హనుమాన్‌గఢ్‌కి ఇంత కాలంలో వాహనోపయోగం సహాయంలేకుండా చేరగలదట సునాయాసంగా. మరి రైలింత నెమ్మదిగా వచ్చిందేం!

## దయాన్ రహస్య యాత్ర !

అభినవ నెపోలియన్‌గా ప్రసిద్ధికెక్కిన మోషెదయాన్ జనతా ప్రభుత్వపాలన సమయంలో రహస్యంగా అప్పటి భారత ప్రధాని, విదేశీ మంత్రి సహాయంతో వచ్చి వెళ్లారట. మోషె దయాన్ ఇజ్రేల్ విదేశాంగ మంత్రి. ఆయన మన దేశం రావడానికి మొదట ప్రధాని, వాజ్‌పేయి ఒప్పుకోలేదనీ, ఆనక మారు పేరుతోనూ, మారు వేషంతోనూ, దొంగ పాస్‌పోర్టుతోనూ బొంబాయిలో వచ్చి దిగారనీ, అక్కడినుంచి ఢిల్లీ వెళ్లి విమానంలో వెళ్లారనీ, ఢిల్లీలో ఓ ప్రముఖుని ఇంట్లో బసచేశారనీ, ఇంటికి ప్రధాని మొరార్జీ దేశాయ్ ఓ రెండుసార్లు, అటల్ బిహారీ వాజ్‌పేయి రెండుసార్లు వెళ్లి ఆయన్ని చూశారనీ వార్తలు వెలువడ్డాయి. వార్త అబద్ధమని వాజ్‌పేయి అంటే మొరార్జీ దేశాయ్ మాత్రం ఖండించలేదట—అలా ఓ విదేశీ ప్రముఖుణ్ణి దొంగపేరుతో, దొంగ వేషంతో, దొంగ పాస్‌పోర్టుతో మన దేశానికి రప్పించాల్సిన అవసరం అప్పటి మాజీ ప్రధానికీ, విదేశాంగమంత్రికీ ఏమొచ్చిందబ్బా!

## హత్యకి దారి తీసిన భూమి తగాదా !

ఓమలూరుకు చెందిన మెట్టుపట్టిలో 40 ఏళ్ల పెరియాతంబి అనే అతను శంకగిరి అనే వూరిలో తాలూకా ఆఫీసులో వుద్యోగం చేస్తూ రోజూ తనవూరునుంచి బస్సులో వెళ్లి తిరిగి ఆఫీసొదిలాక బస్సులో ఇంటికి వచ్చేస్తుండేవాడట. అతనికి సొంతవూళ్లో పొలం కూడా ఉందట. జనవరి మొన్న 8 వ తేదీన ఓమలూరులో దిగి మెట్టుపట్టి నడిచివెళ్తుండగా నాచిముత్తు అనే అతను మరో ముగ్గుర్ని తీసుకుని అతన్ని దారికాసి ఆపి కత్తులతో పొడిచి చంపేశాడట. మొత్తం నలుగురూ కలిసి పదహారు పోట్లు పొడిచారట. ఈ దారుణానికి భూమి తగాదాలే కారణమట. అంత పెద్ద కురుక్షేత్రమే భూమితగాదా ఫలితం కదా!

## శివాజీ గణేశన్ తలకి గాయం !

ఇందిరాకాంగ్రెస్సు నాదరించండి. ఇందిరా కాంగ్రెసుకే మన వోటు అనటానికి కోయంబత్తూరుకు చెందిన సూళూరులోని ఎన్నికల ప్రచార సభలో 18 వ తేదీరాత్రి ఏడుగంటలకు తమిళనటుడు శివాజి గణేశన్ మాట్లాడుతుండగా వున్నట్లుండి కరెంటు పోయిందట. ఆ టైములో కొంతమంది స్టేజిపైకి శివాజీమీద విరుచుకు పడ్డారట. ఎక్కణ్నుంచో ఓ రాయి వచ్చి శివాజి తలకు టోపీని తగిలి ఆయన తలకు పెద్ద గాయం అయ్యిందట. దాంతో ఆయన్ను కోయంబత్తూరు ఆస్పత్రిలో చేర్చారట. రక్తపాతంలేని యుద్ధమేమి!

## ఆత్మహత్యకి దారి తీసిన సినిమా పిచ్చి !

సేలం అన్నదాన పట్టికి చెందిన వేలన్ అనే అతని భార్య 19 ఏళ్ల తంగం అనే ఆమెకు సినిమా పిచ్చట. టక్కు టక్కున ఉదయం ఆటో, మ్యాట్నీనో, మొదటాటో, రెండో ఆటో చూస్తుండేదట. చదువుకున్న కొన్ని, తెలియని కొన్ని సినిమాలు చూసేదట. దీనికెప్పుడూ వేలన్ ఆమెను తిట్టిపోస్తుండేవాడట. ఈ తిట్లకు మనస్తాపంతో పడిపోయిన తంగం మొన్న 18 వ తేదీన తనమీద కిరసనాయిలు పోసుకుని నిప్పంటించుకుని చనిపోయిందట.

## నడిరోడ్డులో హత్య !

అనంతపురం క్లాక్ టవర్‌వద్ద పట్టపగలు సత్తార్, గఫూర్ అనేవారు రామిరెడ్డి అనే అతనిని పొడిచి చంపేశారట. ఈ దారుణ హత్యలో గఫూరుకు, సత్తారుకు మరో నలుగురు అండగా నిలిచారట. ఈకేసు విచారించిన న్యాయస్థానం ఆ ఆరుగురికీ యావజ్జీవకారాగార శిక్ష విధించిందట.

## శవాన్ని మోసిన స్త్రీలు !

కోనసీమకు చెందిన ఇందుపల్లిలో సూర్యకాంతం అనే ఓ వితంతువు మరణించిందట. శవాన్ని స్మశానానికి చేర్చడానికి పూర్తి ఎవరూ సహాయం చేయనందువల్ల ఆమె ఇద్దరు కూతుళ్ళు, మరో ఒకావిడ భర్త, ఆమె మనుమడూ తయారై ఆ నలుగురూ శవాన్ని స్మశానానికి మోసుకుపోయారట. సనాతన సంప్రదాయం ప్రకారం స్త్రీలు శవాన్ని మోయడం గానీ, స్మశానానికి వెళ్లడం గానీ చేయరు. దాని సత్ సాంప్రదాయంగానీ, సనాతన ధర్మంగానీ ఆ పని మరెవరిచేతనైనా చేయించలేకపోతే ఆనాడు సాంప్రదాయం సడలిపోక తప్పదు. ఇంటిపేరుగా వంశవృక్షం: పిల్లలు లేకపోతే పిల్లలు లేనప్పుడు జరిగేదే కదా!






Join
**Carona**
STAMP
COLLECTORS'
CLUB




FREE

**Easy Membership! Unique benefits!**

Get details from your nearest
Carona Retail Shop or write to.

CARONA STAMP COLLECTORS' CLUB
17, 18, Saleh Ahmed Building,
Infantry Road, Bangalore 560 001.

**Take advantage of this opportunity now.**

Membership open to residents of Karnataka,
Kerala, Tamil Nadu and Andhra Pradesh States only

CHAITRA-CS-153 R




## పెన్సిళ్ళన్నీ ఆకారానికి సమానమే
## కాని ఈ రకం మట్టుకు దీర్ఘకాలం వ్రాస్తాయి.

# నటరాజ్ పెన్సిళ్ళు

గ్యారంటీ : చెక్కుతున్నప్పుడు విరగదు. ఎందుకంటే, దీని "బాండెడ్ లెడ్", మిగిలిన వాటి కంటె ధాటీగా పని చేస్తుంది. మరి పెన్సిల్ ఎంత తక్కువ విరిగితే అంత ఎక్కువ కాలం మన్నుతుందన్న విషయం మీకు తెల్సుకదూ !

BONDED LEAD HB ✱ NATARAJ ✱

గ్యారంటీ: అతి మృదువుగా, అతినల్లగా వ్రాస్తుంది. ఎందుకంటె, నటరాజ్ అసమానమైన లెడ్ ఫార్ములా కలిగివుంది. మైక్రొనైజ్‌డ్ గ్రాఫైట్ మరియు క్లే ల మిశ్రమము.

ఇంకా, అతి ప్రత్యేకమైన శ్రేణిలో అప్సరా పెన్సిళ్ళు ! రాయుటకు, రంగులు వేయుటకు, డ్రాయింగుకు మరియు గ్లాస్ మార్కింగ్ ల కొరకు.

## నటరాజ్ దీర్ఘజీవంగల పెన్సిళ్ళు

హిందుస్థాన్ పెన్సిల్స్ ప్రైవేట్ లిమిటెడ్ 79 పాల్టన్ రోడ్, బొంబాయి 400 001.

OBM/4060/TL

**వి. ఎస్. ఎస్. ఆర్ – బుడితి**

అక్కయ్యా! నేను రైతుబిడ్డను. బిజినెస్ మాన్ పెళ్ళాన్ని. ఉద్యోగస్తుడి భార్యను. నా అమ్మాయిని ఎవరికిచ్చి పెళ్లి చేస్తే ఎక్కువ సుఖపడుతుందో ?

నో నిరుద్యోగస్తుడికియ్యి చిట్టి తల్లీ! హాయిగా కూర్చొని తినే అల్లుడు దొరుకుతాడు.

**జె బి ఆర్. – మొగలివల్లి**

ఆడపిల్ల పుట్టిన 10 రోజులకే బొట్టు కాటుక పెడతారు. వాటిని భర్త పోతే తీసేయడం ఎందుకు?

యీ సంఘం చెక్కిన శిల్పాలు తమ్ముడూ నాకివి తెలియవు. అయినా పెళ్లికి పదహారు రోజుల పండగ. బిడ్డకి పదకొండు రోజుల పండుగ. పసి పాపకి ఎర్ర బొట్టు పెట్టరు. అద్దం చూపరు. అయినా పెళ్లి అవడమే సమస్య అవుతూంటే ముండమోసాక తతంగాల గురించి ఆలోచించడం 'పెళ్లి చూపుల్లో మనో వర్తికి బేరాలు' సాగించినట్టుంటుంది. ఫర్‌గెట్.

**ఎస్. పి. వి – అనంతపురం**

మనస్సులో ఏ కల్మషం లేకుండా స్నేహం చేస్తే ఇంట్లోనివారు పరువు ప్రతిష్ఠ పోతుందంటున్నారు. స్నేహాన్ని వదులుకోలేను, యింట్లో ఎదురు చెప్పలేను. ఏం నిర్ణయము తీసుకోను?

పూర్వం ప్రేమ ప్రాణాలు తోడేది ఆంధ్రలో




ఆడపిల్లల్ని. ప్రస్తుతం యీ స్నేహం కాబోలు ఫాషన్. చూడు చిట్టితల్లీ! నీబాధ నాకర్థం కావడం లేదు. స్నేహం ఏ కల్మషం లేకుండా ఒకటి కల్మషంతో కూడింది ఒకటి ఉంటుందా? అసలు స్నేహమంటే ఏమిటని నీవుభావిస్తున్నట్టు? నీవుచేస్తున్న యీ ఏ కల్మషం లేని స్నేహాన్ని నీవాళ్లు ఎందుకు శంకిస్తున్నట్టు— యివన్నీ ప్రశాంతంగా కూర్చుని ఆలోచించుకో. పై వారిపై స్నేహ భావంతో ఇంట్లో వాళ్లపై ద్వేషభావంతోటీ కాదు. నేనేం చేస్తున్నానని ఆలోచించుకో.

**జి. ఎస్ – తుని**

నాకు సంగీత కళ అంటే ఎనలేని పిచ్చి. ఆ కళను పోషించాలని నా తపన.

పాడడం వస్తే పాడి, డబ్బు మాత్రమే ఉంటే సంగీత కళానిధులను ఆదరించి, తమరా కలాపోసన చేయవచ్చు కదా!

**సి. ఆర్. – జంగాగెడ్డ గూడెం**

మీరచనలు కొన్ని చదివాను. సదభిప్రాయమే కల్గింది, మంచి రచయిత్రి అని. కాని గోరింటాకు కథను మీరు కాపీ చేయలేదని అనుకోవచ్చా? కాపీ చేసారని అనుకుంటే...!

నిజం నాకు తెలుసు, నా అంతరాత్మకి తెలుసు. కాపీకొట్టి కథకి పేరేసుకోనిచ్చేటంత వెర్రిదాన్నా! రెండు నవలలూ చదవండి. సినిమా చూడండి. అప్పుడనండి – కె.రా అలాంటి పని చెయ్యదు.

**ఇ. ఎస్. – నాళ్యారుపేట**

మీరు రాసిన డాక్టర్ ఐ లవ్ యు చదివాను. చాలా బాగుందండోయ్. ఈమధ్య మీనవల్స్ తక్కువగా వస్తున్నాయి, ఎందుచేత?

ఏం లేదు చిట్టి తల్లీ! జబ్బులకి రుచ్చే వోపిక తగ్గి పోవడం ఒకటయితే, మనవడు రెండో కారణం.

**ఎస్. పి. – ఖమ్మం**

నేను, మరో కులం అమ్మాయి ప్రేమించుకున్నాం. ప్రపంచాన్ని ఎదిరించేనా పెళ్లి చేసుకుందాం అనుకున్నాం. తన సర్వస్వం నాకర్పించింది. కాని ...

ఏముందీ, కథ మామూలే! పెద్దల వత్తిడివల్ల యీ ప్రపంచాన్నెదిరించాలనుకున్న అమర ప్రేమికులు – గోడదాటడానికి జడిసారు! లేదా, సర్వస్వం అర్పించేశాక పెళ్లెందుకు? ప్రేమేమిటి? అనుకున్నారా?

# 2. ఇరుగు - పొరుగు

మానవుడు సంఘజీవి. ఏకాకితనం అతడి నైజంలో లేదు. పసిపాపగా తల్లి ఒడిలోనో, శిశువుగా తోబుట్టువులతోను, కౌమారదశలో స్నేహితులతోనో, దాంపత్యదశలో ధర్మపత్నితోనో, ఉద్యోగంలో సహాధ్యాయులతోనో, సమాజంలో కిట్టినవాళ్ళతో స్నేహితుడిగానో, కిట్టనివాళ్ళతో విరోధిగానో జీవించక తప్పదు. అయితే కొద్దిగానో ఈ లక్షణాలన్నీ మానవేతర ప్రాణుల్లోనూ కనిపిస్తాయి. అయితే మనకు, వాటికీ వున్న తేడా నైతిక బాధ్యత. నేను చేసింది మందకేమైతేనేమి, చివరికి నా పిల్లలకేమైతేనేమి, అనే సహజాతక వైఖరి జంతువుల్లోను, పక్షుల్లోనూ కనబడతుంది. అందుకే చివరికి మనం అన్యాయంగా పెంచుకొనే సాధుపశువుల్లోగానీ, కుక్క, పిల్లి మొదలైన గృహస్థ జంతుజాలాలల్లో అవి పోట్లాడుకున్నా లేక తస్కరించినా చివరికి ఒక ప్రాణాన్ని బలిగొన్నా వాటిన్ని న్యాయ సభలోకి ఈడ్చుకిపోము. గాని అదే కార్యం ఒక వ్యక్తి చేస్తే తగిన శాస్తి వెంటనే జరుగుతుంది. సంస్కృతియొక్క అత్యున్నత హోదా నైతిక చైతన్యం యిదే.

జగద్రక్షకుడైన యేసుక్రీస్తు మానవ సాంఘిక జీవితాన్ని విపులీకరిస్తూ ఓ కథ చెప్పారు. ఒక వర్తకుడు సంతకని ఒక వూరు బయలుదేరాడు. త్రోవలో జన సంచారం లేని ఒక చోటలో దొంగలు అతణ్ణి దోచుకొని కొన ప్రాణంతో వదిలేశారు. కాసేపటికి యిద్దరు పూజారులు అదే దోవన పోతూ, ఆ క్షతగాత్రుని చూసి కొస్త యిబ్బంది పడి తమదారిన తాము వెళ్ళిపోయారు. మరి కాసేపటికి ఒక అస్పృశ్యుడు తన వాహనంమీద ఆదారినే పోతూ, ఆ దిక్కుమాలినవాణ్ణి చూసి, కనికరపడి, చేయవలసిన ప్రథమ చికిత్స చేసి, తన వాహనంమీద కూచోబెట్టుకొని ఒక సత్రానికి తీసుకపోయి అతని బాగోగులు విచారించడానికి కొంత డబ్బిచ్చి, తిరుగుప్రయాణంలో చెల్లించవలసిందింకా యేమైనా వుంటే, చక్కబెడతానని మాట యిచ్చి వెళ్ళిపోయాడు.

ఈ కథలో నాలుగు రకాల యిరుగు-పొరుగులున్నారు. దొంగలు మొదటిరకం. పొరుగువారిని కొల్లగొట్టుకోవడమే వీరి జీవిత లక్ష్యం. ఇలాంటి యిరుగుపొరుగులు లోకంలో ఎక్కడచూసినా కొల్లలుగా వున్నారు. పూజారులు రెండోరకం. వీరి భక్తి గుడిలోనేగాని, జీవన రస్తాలో ఉపకరించదు. దేవాలయములో దేవుడి సేవకు ఆలస్యమైపోతుందని చక్కా వెళ్ళిపోయారు. గాని దేవుడు ఈ కొనప్రాణితోయిక్కడే వున్నాడని వాళ్ళకు తెలియదు. మూడోరకం హోటలు ★ సత్రం ★ యజమాని. సహాయం చేస్తారు గాని, అదినొక జీవనోపాధికిగాని ధార్మిక బుద్ధితో కాదు. అంతే హోటలు పరిశ్రమ తప్పనికాదు. చెప్పదలచిందేమంటే, మనం చిన్న సహకారం ఎవరికి చేసినా ప్రతిఫలాపేక్ష ఆ చేసిన మంచిని కూడా కలుషితం చేస్తుంది. అస్పృశ్యుడు, అనామకుడు, ఎవరూ పట్టించుకోని ఆ తెరువరి నాలుగోరకం పొరుగువాడు. బేషరతుగా సహాయం చేయడమే అతని ధ్యేయం. ప్రమాదకర పరిస్థితుల్లోనూ, పొరుగువాడి ప్రాణంకోసం తన ప్రాణం పోవడానికి సిద్ధపడ్డ త్యాగధనుడు. ప్రతి వ్యక్తి సంఘంలో తన జీవిత ప్రతిపత్తి ఈ నాలుగు రకాల్లో ఏ కోవకు చెందిందో తెలుసుకోవడం సముచితం.

తనను అనుసరించినవారిని తను జీవిత దుస్థితినుండి ఉద్ధరించి, సంరక్షించి, రక్షించి, వారి ద్వారా మానవ సమాజానికి మేలు కలిగిస్తూ వారిని అమరజీవులుగా చేస్తానని యేసుస్వామి వాగ్దానం చేశాడు. —ప్రియశిష్య

**మీరు కోరినట్లయితే మీ భవిష్యత్ మార్గమునకు ఉచితంగా క్షేమము పుస్తకములను పంపెదము.**

**While writing to us please quote APW/ep**

# AMG INDIA INTERNATIONAL

**Post Box No. 42 :: HYDERABAD-500 004 (A P.)**

**కె. ఎస్. బి. — ఆదోని**

పెళ్ళి వేరు. ప్రేమ వేరు. పెళ్ళి పెళ్ళే. ప్రేమ ప్రేమే. ఈ మధ్య విడుదలైన సినిమాలోని డైలాగ్. దీనిపై మీ అభిప్రాయం.

నన్నడగడం దేనికి? పాత్రోచితంగా రాస్తారు మాటలు. ఆ మాటలు చెప్తే హీరో అయినా ఏ విలనో తప్ప! లేకపోతే పెద్ద మనిషిలా చెలామణి అయ్యే ఏ రావుగోపాలరావో అని ఉండాలి. లేకపోతే ఇప్పుడు సినిమాల్లో ఫ్యాషన్ కనుక ఏ సెక్సు క్రైమ్ వ్యభిచారాన్ని సాగిస్తున్న గృహిణినో, పిల్లో అనాలి. పూర్వం మన తెలుగు సినిమాల్లో వాంపులు కూడా ఇలాంటిమాట అనే వారుకాదు. కాని ఇప్పుడే జయమాలినో అన్నా, జనం ఆనందిస్తారని రాసి ఉండవచ్చునేమో!! [రచయిత కొంప తీసి, మారు వేషంలో హీరోయిన్‌ని ఏడిపించి, వేళాకోళం పేరిట ఒళ్ళు హూనం చేసేస్తూ హీరోయే అన్నాడా!!]

**డి. సి. ఎస్‌డి; కె. జె. కె. — ఆదోని**

మీరిచ్చే సమాధానాల కంటే మేం పంపే ప్రశ్నలే చాలా ఘాటుగా ఉంటున్నాయి. ఏమంటారు?

చిత్రం! అందుకే కదా ప్రశ్న ముందూ సమాధానం తరువాతా వేయడం?

**శివరంజని — తిరుపతి**

మన స్త్రీలలో నూటికి తొంభయి శాతం స్త్రీలు నాభి కిందుగానే చీరలు కడతారెందుకని?

అందంగా ఉంటుందని!

**ప్రసాద్ — సూళ్ళూరుపేట**

పెళ్ళి మానసిక స్థైర్యాన్నిస్తుందంటారు. నిజం అంటారా?

ఆ ఇల్లు గడపగల శక్తి ఉంటే! లేకపోతే అది ఇంకో ఆవేదనకి నిలయం అవుతుంది.

**ఎమ్. ఎస్. ఆర్. — బెల్లారి**

ప్రశ్నావళిలో పూర్తి పేర్లు ఇవ్వటం వల్ల ఏమైనా నష్టమా?

ఆఁ! లోగడ కొన్ని నాటకాలింటూస్తే చిన్న పల్లెల్లో పేర్లు పట్టడం సులభం కనుక— ఆయా పేర్లకి ఏంగ మహారాజులు రాతలు మొదలు పెట్టారు.

**ఎమ్. వి. ముల్క్యూరు**

మీరు ప్రతి పాఠకునికీ, వ్రాసిన ప్రతి ప్రశ్నకూ జవాబులిస్తారా?

లేదండీ! అలా వ్రాయడం మొదలుపెడితే వారం వారం ఐదారు పేజీలు కేటాయించినా జవాబులూ ప్రశ్నలూ కూడా రెండు మూడు నెలలు వెనక బడతాయి. ఇప్పటికే కొత్త సంవత్సరంలో పద్దాను ప్రశ్నల లెక్కన.

వరకట్నం పూర్తిగా ఎప్పుడు రూపు మాపుతుందో తెలియదు. కాని పూర్వం కన్యాశుల్కంలాంటి రోజులు వస్తాయంటారా?

వస్తాయి! అమ్మాయిలు కాస్త పౌరుషంగా నిలబడితే. నిరుద్యోగ సమస్య ఇంకా పెరిగి ఉద్యోగాలున్న ఆడపిల్లల సంఖ్య ఇంకా పెరిగితే తప్పక— కన్యాశుల్కం రోజులు వస్తాయి!



# వంటలు

## కోడిగుడ్డు హల్వా

కావల్సిన సామగ్రి :— కోడిగుడ్లు - 8, పంచదార - ½ కప్పు, నెయ్యి - ½ చెంచా, ఏలకుల పొడి 1½ చెంచాలు, కిస్‌మిస్ పళ్ళు - 12 జీడిపప్పు - 8

ఈ హల్వా తయారు చేయడం చాల సులభం. చూడటానికిది పసుపు పచ్చగా వుంటుంది. అయితే తినేందుకు చాల బాగుంటుంది కోడిగుడ్లు తాజావిగా వుండాలి. నెయ్యి కూడ మంచిదిగా వుండాలి. వేడిగా తింటేనే ఈ హల్వా రుచికరంగా వుంటుంది.

తయారు చేసే విధానం :— కోడిగుడ్ల లోని సొనంతా ఓ కప్పులో వేసి, ఎగ్ బీటర్‌తో గాని లేదా స్పూనుతో గానీ, బాగా చిలక్కొట్టి, కలియబెట్టాలి పంచదార కూడ వేసి మరల బాగా కలపండి. ఒక బాణలిలో నెయ్యి మరగనిచ్చి, జీడిపప్పు, కిస్‌మిస్ పళ్లను వేసి కాస్త వేగనిచ్చి, ఈ కలియబెట్టిన సొనను వేసి చెయ్యి తగలకుండా కలుపుతూ వుండాలి. హల్వా పాకానికొచ్చి ఉండలాగ తయారౌతుంది. అప్పుడు ఏలకుల పొడిని వేసి బాగా కలిపి, ఓ ప్లేటులో నూనెగానీ, నెయ్యిగానీ రాసి, హల్వాను ఆ ప్లేటులోకి తీసుకోండి. స్వీట్ స్టాల్లో కొని తినడం కంటె, ఈ హల్వాను స్వయంగా చేసుకుంటె, రుచి, తృప్తి లభిస్తాయి.

- శారద

## కూరలతో ఊతప్పం

కావలసిన సామానులు :— బియ్యం - 1 కప్పు, మినప్పప్పు - ½ కప్పు, బఠానీలు - ½ కప్పు (ఉడికించినవి). కారెట్ ముక్కలు - ½ కప్పు, కాలీఫ్లవర్ గుత్తులు - ½ కప్పు, పచ్చిమిర్చి - 2 కాయలు, చిన్న ముక్క అల్లం, జీలకర్ర - 1 చెమ్చా, చిటికెడు సోడా, ఉప్పు.

తయారుచేయు విధానము : మినప్పప్పు, బియ్యం విడివిడిగా నీళ్ళల్లో నానబెట్టాలి. బాగా నానాక పొట్టుతీసి మెత్తగా కాటుకలా రుబ్బుకోవాలి. బియ్యం కడిగినవాటిని కూడా మెత్తగా రుబ్బుకోవాలి. కాలీఫ్లవర్ గుత్తులు కొంచెం నీరుపోసి 5 నిముషాలు ఉడికించాలి. అల్లం ముక్కలు, పచ్చిమిర్చి ముక్కలు, జీలకర్ర, ఉడికిన బఠానీలు, కాలీఫ్లవర్ గుత్తులు, కారెట్ ముక్కలు యివన్నీ రుబ్బిన పిండిలో వేసి అన్నీ ఒక పాత్రలో వేసి ఉప్పువేసి కలిపి పెట్టుకోవాలి.

స్టౌపై పెనం పెట్టి నూనెవేసి వేడయ్యాక, ఒక గరిటె పిండిపోసి (లావుగా) పైన మూత పెట్టాలి కొంతసేపయ్యాక మూత తీసిచూస్తే ఉబ్బి వుంటుంది. ఒక వైపే కాల్చాలి ఈ ఊతప్పం. సన్నని సెగ అయితే బాగ వస్తాయి. త్వరగా నేక తీసి పెట్టుకోవాలి వేడవేడిగా- చట్నీతో లేదా నెయ్యితో లేదా వెన్నతో ఎవరిష్టంతో వారు తినాలి.

— వల్లిశ్రీ నాగరాజ్

## వెన్న రొట్టె

కావల్సిన వస్తువులు :— వెన్న - 200 గ్రా, పంచదార - 1 పావు, పచ్చి కొబ్బరి చిప్ప - ఒకటి, గోధుమపిండి 1 పావు, ఏలకులు - నాల్గు లేక అయిదు, చిటికెడు కేసరి

తయారుచేయు విధానం :— ముందుగా పంచదారను పొడి చేసుకుని వుంచుకోవాలి. తర్వాత అందులో వెన్న, తురిమిఉంచుకున్న కొబ్బరి తురుము(కోరు)ను వేసి బాగా కలపాలి. గోదుమపిండిలో ఈ మిశ్రమాన్ని ఏలకుల పొడిని, కేసరిని బాగా కలిపి చపాతి పిండిలాగ తయారు చేసుకోవాలి. ఆ తర్వాత ఆ పిండిని నిమ్మకాయంత సైజులో చిన్న చిన్న ఉండలుగా చేసుకుని, సన్న సెగమీద వాటిని పూరీల్లాగా వత్తి, ఉత్త పెనం మీద (నూనె వేయకుండా) బాగా రెండు వైపులా కాలేటట్లు, ఒక్కొక్కటే దోరగా కాల్చాలి. ఇవి వేడిగా తింటే బలే పసందుగా వుంటాయి. అధీనకవది రోజులపాటు చెడిపోకుండా నిల్వ వుంటాయి.

- ఎస్ ధనలక్ష్మిదేవి

## బంగాళాదుంప జిలేబి

కావలసినవి : బంగాళా దుంపలు — అరకేజి, పంచదార - పావుకేజి, నెయ్యి — పావుకేజి, సితాయి రంగు - 1 స్పూను.

తయారుచేయు విధానం : బంగాళా దుంపలను ఉడకబెట్టి, తొక్కతీసి, పిండిగా రుబ్బివేయాలి. స్టౌ మీద బాణలి పెట్టి, నెయ్యి వేసి మరిగిన తరువాత జిలేబి గొట్టంలో బాగా బంగాళాదుంప పిండి వేసి ఆ మరిగిన నెయ్యిలో జిలేబి చుట్టలాగ వేసి వేగనివ్వాలి. ఎర్రగా వేగించినాక దించుకోవాలి. ఈ లోపల మరో స్టవ్ మీద వెడల్పాటి గిన్నెలో పంచదార, నీళ్ళుపోసి పాకం తీసాక సితాయి రంగు వెయ్యాలి. త్వరగా వేగించిన జిలేబిలను బాగా పాకంలో వేసి తీసి చల్లబడిన తర్వాత తింటే చాలా రుచిగా వుంటాయి.

- మిసెస్ రావు



# హైదరాబాదు నోట్‌బుక్

### వైస్ ఛాన్సలర్ ఆవేదన !

విశ్వవిద్యాలయాలు చెప్పుకోడానికి స్వయంనిర్ణయాధికారం గల సంస్థలే గాని, నిజానికి స్వయం నిర్ణయాధికారం కని మిగిలిన వెలగవందని ఉస్మానియా విశ్వవిద్యాలయం వైస్‌ఛాన్సలర్ ప్రొఫెసర్ జి. రాంరెడ్డి మే 19న అడ్మినిస్ట్రేటివ్ కాలేజీలో ప్రసంగించినప్పుడు అన్నారు. వైస్ ఛాన్సలర్ల కాలమంతా విశ్వవిద్యాలయాలలో శాంతి స్థాపనకే సరిపోతుందని ఆయన తెలిపారు. "ప్రభుత్వాలు మారడంతో విద్యా మంత్రులు మారుతున్నారు. వారి మార్పుతో విద్యా విధానం మారుతున్నది. విద్య చవకబారు సరుకయింది. చదువుచెప్పేవానికి తప్ప తక్కిన వారికి విద్య అంటే ఏమిటో ఎలా చెప్పాలో మా ఫ్రెండాలో ఉపన్యాసాలిస్తున్నారు. చదువు జీవితాన్ని తీర్చి దిద్దాలి. దానికి కొంత దశాబ్ది ప్రణాళికో, ఇరువది ఏళ్ళ ప్రణాళికో వుండాలి. అప్పుడే విశ్వవిద్యాలయాలు విద్యాలక్ష్యాన్ని సాధించగలవు." అని ఆయన అన్నారు. కొన్ని విశ్వవిద్యాలయాలలో సెమిస్టర్ పద్ధతి పరీక్షలు సక్రమంగా జరుగడం లేదని, వార్షిక పరీక్షల పద్ధతే మేలని ఆ విశ్వవిద్యాలయాలు అభిప్రాయ పడుతున్నాయని ఆయన అన్నారు. విశ్వవిద్యాలయాలు సంఘానికి 'ప్రశాంతి శాలలు' గా వున్నాయని, నిరుద్యోగం వల్ల ఏర్పడిన సమస్యలకు, తక్కిన సమస్యలకు లక్ష్యాలయ్యాయని ఆయన అన్నారు. ప్రభుత్వాల మార్పుతో మొదటి దెబ్బ పడేది విద్యా విధానం పైన. తక్కిన శాఖలయితే నిరసన తెలుపుతాయి. విద్యా శాఖ పాపం—గొర్రెలమంద. ఎటు ఉడితే అటు తిప్పవచ్చు. వైస్ ఛాన్సలర్ అన్నట్టు విద్యావేత్తలకు తప్ప తక్కిన వారందరికీ విద్యా విషయంలో అభిప్రాయాలున్నాయి. సంగీతం రాని వాడు, వైద్యం తెలియనివాడు లేరని సామెత. దానికి చదువును గురించి సలహాలు చెప్పనివాడూ లేడని చేర్చాలనుకుంటాను. ప్రజాస్వామ్యంలో చిన్ననాడు క్రమబద్ధమైన చదువు లేనివారు విద్యా మంత్రులు కావడం సహజం. వారికి పాపం ఏవేవో అభిప్రాయాలుంటాయి. వారు విద్యావేత్తలకు పాలసీలు డిక్టేటు చేస్తారు. విద్యావేత్తలకు విద్య గురించయితే తెలుసు గాని, వారు చెబితే వినే ప్రజ లేరి? ప్రజా ప్రతినిధులయిన మంత్రులు చెబితే ప్రజలు వింటారు గాని, బడుగు బడిపంతులు[విద్యా వేత్తలందరూ ప్రజలదృష్టిలో బడి పంతుళ్ళే]చెబితే వింటారా? కనుక విద్యావేత్తలు తమ ఆత్మ గౌరవాన్ని అంతరంగంలోనే దాచుకో వలసిన దుర్గతి ఏర్పడింది. పూర్వమయితే రాజులు కూడ తమ కుమారులను గురుకులాలలో చదవ వెళ్ళే వారు. ఇప్పుడు "పంతులూ! ఫలానా విధంగా చెప్పు. "డాక్టరూ! ఫలానా మందివ్వు" అనే దురవస్థ ఏర్పడింది.

### జంటనగరాలలో మంచినీటికోసం కంటనీరు:

మంచి నీటి కోసం కటకట పడిన ఎవరో "పరమేశా! గంగ విడువు. పార్వతి చాలున్" అని ఆనాడు గంగాధరుణ్ని ప్రార్థించాడట. జంట నగరాల వారు ఎవరిని ప్రార్థించినా ప్రయోజనం లేదు ఈ వేసవిలో. మే నెలలో వేడి తీవ్రత 107 డిగ్రీలకు తగ్గలేదు. జంటనగరాలలో మంచి నీటి కొరత కు ప్రతి చోట గంగాయాత్రా యత్నమే తార్కాణం. పిల్లలు మొదలు పెద్దల వరకు చెంబులు, గిన్నెలు, కుండలు, కడవలు పట్టుకొని వెళ్ళుతూ పల్లెటూరి రామణీయకాన్ని సంతరిస్తుంటారు. మునిసిపాలిటీ వారు యథాశక్తి ఏర్పాట్లు చేస్తూనే వున్నారు. 'హిమాయత్‌నగర్ లయన్ యూత్ అసోసియేషన్' వంటి ధర్మ సంస్థలు ఉంటే మంచినీరు అందిస్తూ, ప్రబంధ కాలాల చలివేంద్రాలను మరిపిస్తున్నాయి. అయినా నానాటికీ పెరుగుతున్న జనాభా వాలుక తడపటానికి కొత్త కొత్త ఏర్పాట్లు జరుగాలి కదా!

### ఇమాం పసంద్‌కు బహుమతి :

మే నెల 21—22 లలో జరిగిన అఖిలభారత ఆమ్రఫల ప్రదర్శనంలో ఇమాం. పసంద్‌కు ప్రథమ బహుమతి లభించింది. ఈ బహుమతి పొందిన వారు నూజివీడు తాలూకా ఎనమదల గ్రామ వాస్తవ్యులు శ్రీ పి. సీతారామాంజనేయులు. రకరకాల మామిడి తాండ్రలు, ముక్కల ఊరగాయలతో విజయనగరం జిల్లా బొన్నవలస గ్రామ వాస్తవ్యులు శ్రీ పి. సీతారామరాజుకు ప్రత్యేక బహుమతి లభించింది. సమాచార ప్రసార శాఖమంత్రి శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి బహుమతులను పంచారు. అధ్యక్షత వహించిన వ్యవసాయ శాఖామంత్రి శ్రీ వెంకటరావు అడవులను, పండ్ల తోటలను పెంచడం అవసరమన్నారు. దేశంలో అడవుల విస్తీర్ణం 33 శాతం కాగా, ఆంధ్రప్రదేశ్‌లో 29 శాతమేనని అన్నారు. ఈసారి మామిడి పూటుగా పండింది. కాని, అగ్ని ప్రమాదాల వల్ల రవాణాకు అవకాశం అంతగా లేనందున నష్టం కూడ కలిగింది.

### రాష్ట్రావతరణ రజతోత్సవాలు :

వచ్చే నవంబరు 1కి ఆంధ్ర రాష్ట్రం అవతరించి 25 ఏళ్ళు పూర్తవుతాయి. ఈ సందర్భంగా వచ్చే నవంబర్ 1వ తేదీనుంచి సంవత్సరంపాటు రజతోత్సవాలు జరుపాలని రాష్ట్ర మంత్రి వర్గం మే 9న నిర్ణయించింది. ఈ రజతోత్సవ సంవత్సరంలో 20 సూత్రాల కార్యక్రమం ప్రధానంగా అమలుపరచడం జరుగుతుందని ముఖ్య మంత్రి డాక్టర్ ఎం. చెన్నారెడ్డి తెలిపారు. రజతోత్సవాల నిర్వహణకు ఒక సంఘం నియమిస్తారు. ఈ సంఘ సభ్యుల పేర్లు తర్వాత ప్రకటిస్తారు. ఈ రజతోత్సవంలో ఐదుగురు ప్రముఖ ఆంధ్ర నాయకుల శత జయంత్యుత్సవాలు కూడా కలుస్తున్నాయని ముఖ్య మంత్రి అన్నారు. వారు డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య, డాక్టర్ కూచిమంచి రామలింగారెడ్డి, సర్ సి. వై. చింతామణి, బళ్ళారి రాఘవ, డాక్టర్ ఆచంట లక్ష్మీపతి ఈ ఐదుగురుని స్మరించడం గొప్ప సంగతి.

### ఉపశ్రుతి :

"ఏం సార్! మీ పిల్లలు బాగా చదువుకొంటున్నారా?" అని ప్రశ్నించాను ఒకరిని. ప్రక్కనే వున్న మిత్రులు ఏకాగ్రపగడ ప్రసాదరావుఅన్నారు— "ఇవాళ రేపు చదువు కొనడం [ఖరీదు చేయడం] కదా! వారి పిల్లలు ఏం చదువుకొంటారు పాపం! ఏదో మొక్కుబడిగా చదువుకుంటున్నారు" అన్నారు. "మంచి శ్లేష లా గా రే" అన్నాను నేను ప్రశంసగా.

—తిరుమల రామచంద్ర







మీరు యింకొ
యే యితర
ఖర్చులకు
ఆలోచిస్తున్నారు

# మీకు అందించిన దానికొరకు కెనరా బ్యాంకును సహాయము చేయనీయండి

భవిష్యత్తులో మీరు తలపెట్టిన పెద్ద ఖర్చులనైనా సగము ఖర్చు కెనరా బ్యాంకు భరిస్తుంది.
మీరు ముందుగా ఆలోచించి పొదుపు చేసిన ప్రతిదీ మీకు అందుబాటులోనే వుంటుది. మీకు రాబోయే యే విధమయిన ఖర్చులకుగాను సహాయముచేయుటకే కెనరా బ్యాంక్ ప్రత్యేకమయిన ప్రణాళికలతో కలిగియుంది.

ఎన్నాళ్ళనుంచో కోరుకొంటున్న మోటారుకారా స్కూటరా! స్వంతయిల్లా! మీ బిడ్డకి వున్నత విద్యయా! లేక పెళ్ళా! కామధేను పొదుపు ప్రణాళికలో మీ డబ్బును కాలపరిమితిలో ఎక్కువ వృద్ధిపొందును.

ఈ ప్రణాళికలోని గొప్ప విశేషమేమనగా మీకు కావలసిన మొత్తములో కొద్దిభాగముని పొదుపు పరచుటయే.
పొదుపుపరచు మొత్తమును, నెలల సంఖ్యను మీరే నిర్ణయించుకొనండి. దానిమీదనుండి వడ్డీమీద వడ్డీయే మీకు నెలనెలా మంచి రాబడి, మరియు మీ డబ్బు రెండింతలకు పైగా వృద్ధిపొందుతుంది.
మీ దగ్గిరలో నుండు కెనరా బ్యాంక్ శాఖకువెళ్ళి వివరములు తెలుసుకొనండి
మా యితర ప్రత్యేక ప్రణాళికలు: విద్యానిధి నిరంతర కాలక్షేమ.

## కామధేను పొదుపు

## కెనరా బ్యాంక్




కెనరా బ్యాంక్ (జాతీయ బ్యాంక్)
దేశము మొత్తమున 1200కు పైగా శాఖలు కలవు.

maa CB 5 Tel B 80

# అవీ...ఇవీ...అన్నీ

## ఎర్రచీర

విశాఖ రచయితల సంఘంవారు వెలువరించిన శ్రీరంగం రాజేశ్వరరావు కథల సంపుటం. ఇందులో ఎర్రచీర, మేడ, దేవుడిమనసు లాంటి మంచి కథలు మొత్తం పన్నెండున్నాయి. ముఖచిత్రం నావి. ప్రతులకు శ్రీరంగం సుబ్బారావు, గానుగుల వారివీధి, విశాఖపట్నం—1కి వ్రాయవచ్చును.

## సునీతా ! ఓ సునీతా !

శ్రీమతి హజరా రాసిన నవల: 296 పుటలు. ప్రతులకి శ్రీ కవితా పబ్లికేషన్స్ విజయవాడ—2కి వ్రాయాలి. వెల : రు. 12—50.

## రాగానుబంధాలు

శ్రీమతి వై. జి. భవానీ వ్రాసిన నవల-పుటలు 237 ముఖచిత్ర రచన చంద్ర. ఈ నవలకి కూడా పై ప్రచురణకర్తలకే వ్రాయవచ్చును.

## గలివర సాహస యాత్రలు

జొనాథన్ స్విఫ్ట్‌గారి లోకప్రసిద్ధమైన గల్లివర్స్ ట్రావెల్స్‌కి యువరచయిత శ్రీ ప్రయాగ రామకృష్ణ చిన్నపిల్లలకి అర్థమయ్యే రీతిన చేసిన స్వేచ్ఛానువాదం. పెద్ద అచ్చులలో పిల్లలకి అనువైనతీరున బొమ్మలతో వేశారు. చందమామ సైజు, వెల— రు. 1—00 ప్రతులకి న్యూస్టూడెంట్స్ బుక్ సెంటర్, విజయవాడ—2కి వ్రాయాలి.



ఇటీవల నెఫ్జా ప్రారంభోత్సవ సభలో సినీ నటుడు శ్రీ ప్రభాకరరెడ్డిని సన్మానిస్తున్నది యం. యల్. ఏ., కె. వి. సుబ్బారెడ్డి. ప్రక్కనున్నది నెఫ్జా సుందర రామిరెడ్డి, వారి సతీమణి శ్రీమతి లక్ష్మి

## అందాల వసంతం

విజయసాహితి విజయపురివారి 80 ఉగాది కవితా సంకలనం వెల తెలీదు. మా కార్యాలయం చేరింది. ప్రతులకి పై సంస్థకి వ్రాయాలి. ●

# ఉత్తరాలు

(6వ పేజీ తరువాయి)

## కథలు

6—6—80న సంగీత ముఖచిత్రంతో వెలువడిన మా పత్రికలోని కథలు ఆణిముత్యాల్లాగా ఉన్నాయి. ముఖచిత్రం మరీ సెక్సీగా ఉంది.

నిరీక్షణ కథలో ప్రసాద్ చిత్రీకరణ అద్భుతంగా ఉంది. ముగింపు బాగుంది.

ఇకపోతే విలువైన బహుమతి విషయంలో రచయిత బహుమతుకోసం వేడుకలు జరిపేవాళ్లకు కనువిప్పు కల్గించారు. వార్కికి మా ధన్యవాదాలు.

ములుగు శివానందశర్మ, కస్తూరి అమర్‌నాద్
(రామగిరి)

* * *

6—6—80వ తేదీలో వెలువడిన, ఆంధ్ర సచిత్ర వారపత్రికపై తెలుగునటి సంగీత ముఖచిత్రం మళయాళీ బ్రాండ్ మాళ్ళులా ఉంది. కథలు మూడూ, సీరియల్స్ రెండూ చక్కగా సాగాయి. ఎప్పుడూ కూడా, మూడు కథలు తక్కువ కాకుండా వేస్తారని ఆశిస్తాము. మేని చిటపటలు కార్టూన్స్ [సీతా] మరీ నవ్వించలేదుగానీ, మొత్తానికి ఫర్వాలేదని నవ్వించాయి. విలువైన బహుమతి కథలో చక్కటి నీతి ఇమిడి ఉంది. ధనవంతులు ఏదో ఇస్తారు అని పొంగిపోయి, వాళ్లను పార్టీలకి పిల్చిన వో మాదిరి వాళ్లను పిలవకుండా మనిస్టేటస్‌కి తగరు, అనుకుంటే మనస్తత్వం కల్గి ఉన్నావాళ్ళు, ఈ కథ చదివి మారకుండా ఉండలేరు. సుజాతలాంటి పాత్రలకు సిగ్గు వచ్చి, తమలో మార్పుతెప్పించిన రంగయ్యలాంటి పాత్ర లోకంలో మంచివాళ్లకు ప్రతీకగా తెలిపిన రచయిత అభినందనీయులు. ఇటీవల కాలంలో నేనుమెచ్చిన, నాకు నచ్చిన నీతిదాయకమైన కథ విలువైన బహుమతి

పెన్మెత్స సూరిబాబు (హైదరాబాదు)

## సీరియల్

ఈ వారం ప్రచురించిన 6—6—80 కథల్లో విలువైన బహుమతి కథ నచ్చింది. నిరీక్షణ చివర్లో రచయిత్రి చేసిన ముగింపు అంత బాగా లేదు. అనుభూతి—అనుబంధం సీరియల్ బాగున్నది. జీడిగుంట రామచంద్రమూర్తిగారికి నా అభినందనలు.

కె. నారాయణరావు (తాడిపత్రి) ●

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3, Editor: S. Radh...